# గీతావాణి

**41**




నాల్గవ సంవత్సరము  ఐదవ సంచిక

గౌరవ సంపాదకులు: స్వామి శ్రీ శంకరానంద.

## శ్రీ గీతాసాహిత్యసేవాసమితి,

ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

15 నవంబరు 1954

# విషయసూచిక – నవంబరు '54.



## చందాదార్లకు విజ్ఞప్తి

డిసెంబరునెలలో భక్తియోగ విశేషసంచిక ప్రకటింపబడును. ఆసంచిక సుమారు నూరు పేజీలకు లోబడివుండును. యథాప్రకారము డిసెంబరునెల 15_వ తేదీ పోస్టుచేసి చందాదార్లకు పంపబడును. పెద్దకేపరుతో చక్కగా ప్యాక్ చేసి కార్యాలయమునుండి పంపుదుము. 17_వ తేదీకి చందాదార్లకవి చేరగలవు. చందాదారులు దయయుంచి హెచ్చరికతో వాటినందుకొనవలెననియు, 18 తేదిలోగా చేరనిచో వెంటనేమాకు ఉత్తరము వ్రాయవలెననియు మనవి చేయుచున్నాము.

అల్లగడ్డ పోస్టు,
కర్నూలు జిల్లా.

— మేనేజరు,
గీతావాణి కార్యాలయము.

# “ గీతావాణి ”



మేనేజర్:

గీతావాణి – ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

సంవత్సరచందా 4–0–0. ❋ విడిపత్రిక 0–6–0

# గీతాగానము.

కీ॥ శే॥ డాక్టరు రంగా చిన్నచలమయ్యగారు, చాగలమర్రి.

[ 1954 మే సంచిక 2-వ పుట తరువాయి. ]

అర్జునుడు:_అదియేనిజమూ అయినను – నీవును నేనూ ఒక్కటే ॥కృ॥
కృష్ణుడు:_పరమాత్మరూపము నాదియే – జీవాత్మరూపము నీదియె ఫల్గుణా......
నాదూనీదూ జన్మలూ – నాకే తెలియును పార్థివా ॥జ్ఞా॥
అర్జునుడు:_దేవుడు చావడు పుట్టడు అనుచు నీవే మోబల్కితివి,
మరిమరి పుట్టుచుంటినని యెదవుయేలా కృష్ణా...
ఇదియేనాకూ సంశయం – కారణమేమో దెల్పుమా ॥కృ॥
కృష్ణుడు:___
1. నేను నిర్వికార నిరంజనుడ, చావుపుట్టుకలులేక సంచారముసలుపుచుందు,
జీవరాసులన్నింటికిని జీవాత్మలనిచ్చినాను, జీవాత్మకుస్వాతంత్ర్యము లేదు లేదికా...
నీవే జీవాఆత్మవూ – నేనెపరమాఆత్మనూ
నీకూనాకూ భేదమూ – యిదియె తెలియు ఫల్గుణా ॥జ్ఞా॥ (శ్లో. 6)
2. మాయనావశమున్నది, మాయనీవశముగాదు, నామాయచేత నేనేజన్మింతు ఫల్గుణా...
నాదూదేహం స్వతంత్ర్యమూ – నీదూదేహం పరతంత్రం ॥జ్ఞా॥
3. న్యాయముచెడిపోయి, యన్యాయము ప్రబలుచున్న, నన్ను నేనే పుట్టించెదన్,
ఆకారముదాల్చి నేను యింద్రియంబుల కగపడెదను ఫల్గుణా ...
నాదూమాయామర్మమూ – ఇదియె నీవూ తెలిసికో ॥జ్ఞా॥ (శ్లో. 7)
4. శిష్టులరక్షణకొఱకు నేనె – దుష్టులశిక్షణకొఱకు నేనే
యుగముయుగములందు నేనే – అవతారంబునూదాల్తు నేనె
ధర్మముకొఱకూ నేనెగా – ధరించుచుందూ అవతారం ॥జ్ఞా॥ (శ్లో. 8)
5. నాదుజన్మలు తెలియుటకు, నాకర్మయెఱుగుటకు, తత్త్వవేత్తకైనను తరముగాదు,
అదియెఱిగియున్నవారికి యేజన్మలేదుభూమిలో, జ్ఞానమనుతపంబుచేత,
క్రోధ భయరాగములను వదలి, నన్ను ఆశ్రయించి నా భావమునుపొందిరి ఫల్గుణా ...
జ్ఞానముగలిగినావారలే – నన్నే కోరీసుఖింతురు ॥జ్ఞా॥ (శ్లో. 9,10)
6. ఏ తీరున సేవింతురో, ఆతీరున నేనుండి వరములిచ్చి ఆదరింతును,
అన్ని విధాల భక్తి నాయందు అనుసరించు ఫల్గుణా ...
మోక్షముగోరినావారికె – మోక్షమునిత్తునూ పార్థివా
సేవకుదగినా ఫలమూనే – కోరినవారికే నిత్తునూ ॥జ్ఞా॥ (శ్లో. 11)
7. అశాశ్వతఫలమునకై ఆశించినమనుజులెల్ల, దేవతలనుగొల్చుచుందురు,
అతిశీఘ్రమేయవి లభించునని యాశలు గలుగజేయు ఫల్గుణా ...
శాశ్వతమైనా ఫలమునకే – నేనే తెలిపెద తెలిసికో ॥జ్ఞా॥ (శ్లో. 12)



సంపుటి 4 ★ స్వస్తిశ్రీ జయ – కార్తీకమ్. సంచిక 5

# యోగక్షేమములు.

భగవద్గీత తొమ్మిదవ అధ్యాయము యిరవై రెండవశ్లోకమున "యోగక్షేమ"మనెడి పదము ప్రయోగింపబడినది. ఆ మాట కర్థమేమో సవిస్తారముగ వివరించుకొందము.

మానవుని జీవితమును బహిరంగ జీవితమని అంతరంగ జీవితమని రెండువిధములుగ విభజింపవచ్చును. దానినే వెలిబ్రతుకు – లోబ్రతుకనికూడ అనవచ్చును. ఆవిధమునుబట్టి యోగక్షేమములు కూడ రెండువిధములై యున్నవి. బాహ్యజీవితమునకు సంబంధించిన యోగక్షేమములు ఒకవిధము. అంతర్జీవితమునకు సంబంధించిన యోగక్షేమములు రెండవవిధము. విత్తము – కళత్రము – క్షేత్రము, బాహ్యజీవితమునకు చెందినవి. జ్ఞానము – మనస్సు – దేహము,

అంతరంగ జీవితమునకు చెందినవి. "యోగక్షేమము"లనెడి ఒక్క మాటయందీ ఆరింటియొక్క బాగోగులు పరామర్శింపబడినవి.

యోగమనిన సంపాదించుట; లేనివస్తువును సమకూర్చు కొనుట. క్షేమమనిన సంపాదించినది జారిపోకుండునట్లు – కలిసి వచ్చినది చెదరిపోకుండునట్లు రక్షించుట. ఈ అర్థమననుసరించి జీవితముయొక్క యోగక్షేమములను విచారింతము.

బాహ్యజీవితమునకు చెందినవాటియందు ధనము మొదటిది. ధనమనినమాటకు ధనధాన్యముల రెంటిని గ్రహింపవలెను. ఇవి లేనిచో జగన్నాటకము నడవనె నడవదు; జీవయాత్రసాగనెసాగదు. "మీయోగక్షేమములెట్లున్నవి?"అని మనబంధుమిత్రులనడుగుదుము. ఉత్తరములలో వ్రాయుదుము. దాని అర్థమేమి? "ధనధాన్యములు సమృద్ధములై యున్నవా? అతివృష్టి – అనావృష్టి – చోరాదిభయములు లేవుగదా?" అని అడిగినట్లు భావించవలెను. పైన చెప్పిన ఆరింటియందు యిది ధనమునకుచెందిన యోగక్షేమములు. ఇదొక్క అర్థము. రెండవ అర్థము స్త్రీ విషయకము. వివాహమైనదా? బిడ్డలున్నారా? కుటుంబము ఆరోగ్యముగనున్నదా? అందరును ఒద్దికగనున్నారుగదా?" అనెడి ధ్వని ఆ యోగక్షేమ ప్రశ్నయం దంతర్భూతమై యున్నది. మూడవ అర్థము భూములకు సంబంధించినది. "ఆస్తిపాస్తులెంతమట్టుకు? గృహారామక్షేత్రములను క్రొత్తగ సంపాదించియున్నారా? వాటిని శ్రద్ధతో పాలించుచున్నారుగదా?" – ఈ మాటలు ఆ యోగక్షేమ ప్రశ్నయందు సూచితములై యున్నవి.

ఇవి మూడును బాహ్యజీవితమునకు చెందినవి. ఇక అంతర్జీవితమునకు సంబంధించిన యోగక్షేమములను విచారింతము. అవియే నిజముగ తనకుపకరించెడి స్వకీయ యోగక్షేమములు. తనయందలి జ్ఞానమె నిజమగు ధనము. తనమతియె తనకు సతి. తన

దేహమే తన క్షేత్రము. వాటి యోగక్షేమములచే తాను సంపన్నుడు కాగలడు.

జ్ఞానము — అనుభవము కలిసి ఒక సంపద. అవిలేని మనుష్యుడు మనుష్యుడనిపించుకోలేడు. జ్ఞానప్రాప్తివలన — అనుభవ ప్రాప్తివలన మనుష్యుని భూమిక ఉన్నతముకాగలదు. బాహ్యములగు ధనధాన్యముల నార్జించి గొప్పవాడనిపించుకొనునట్లు, జ్ఞానధనమును — అనుభవధాన్యమును సంపాదించి మానవుడు మహాత్ముడనిపించుకొనును. ధనముండి ధాన్యములేనిచో బాహ్యజీవితమునందు రాణింపు లేదు. అట్లే జ్ఞానముండి అనుభవములేనిచో అంతర్జీవితమున శోభ లేదు. నేయిలేనితిండి, కంఠములేని గానము పసలేనట్లు, అనుభవము లేని జ్ఞానమునకు విలువలేదు. యోగక్షేమముల చర్చించునపుడు వీటినికూడ గుర్తించుకొనవలెను. ఇది జ్ఞానానుభవములనెడి ధన ధాన్యములకు చెందిన యోగక్షేమము. ఇది నాల్గవది.

మతిగతులకు చెందిన యోగక్షేమములు అయిదవవిధము. అంతర్జీవితమున నవియె ఆలుబిడ్డలు. "ఆత్మా త్వం గిరిజామతిః" అను స్తోత్రపాఠము సుప్రసిద్ధము. మతియే జీవునకు సతి. "సతి వలె మతికూడ సానుకూలమై యున్నదా? మతిగతులు — మనో విచారములు స్వవశములై ప్రవర్తించుచున్నవా?" అనెడి ప్రశ్న యీ యోగక్షేమమున యిమిడియున్నది.

కాయకరణములు ఆరవదియగు యోగక్షేమమునకు సంబంధించినవి. ఇవి అంతరంగ జీవితమునకు గృహక్షేత్రములవంటివి. దేహమనెడి గేహమును భద్రపరిచి అంతర్జీవితమును హాయికొల్ప వలెను. దేహమనెడి క్షేత్రమును సారవంతమొనర్చి భోగమోక్ష ముల పండించవలెను. దేహేంద్రియములు స్వచ్ఛములై సుందర ములై సౌష్ఠవములై ప్రయోజనసిద్ధికి అనుకూలములై యుండ వలెను. పెడదారుల పరుగిడకుండ వాటిని సత్క్రమమార్గమున

హెచ్చరికతో నడపవలసియుండును. అవి తమ లక్ష్యమును చేరు కొనవలెను, దానికి తగిన శక్తిసమర్థతలు చేకుఱునట్లు వానిని పోషింప వలెను. అశక్తితో సోలిపోకుండునట్లు దృష్టినుంచవలెను. "దేహారోగ్యము లెస్సగనున్నదా? ఇంద్రియపాటవము సరిగనున్నదా?"- యనెడి ప్రశ్న యీ ఆరవయోగక్షేమమునకు చెందినది.

జీవితము సర్వాంగసౌందర్యమును, సర్వతోముఖ వికాస మును కల్గియుండవలెననిన యీ ఆరువిధములగు యోగక్షేమము లుండియె తీరవలెను. ఏ ఒక్కటి లోపించినను జీవితమునకు సమ గ్రత సిద్ధించదు. మొదటి మూడును భోగాంగములు. చివరిమూడును యోగాంగములు. మొదటివి ప్రేయస్సాధనములు. చివరివి శ్రేయ స్సాధనములు. ఒకటి లౌకిక జీవనము. మరొకటి పారమార్థిక జీవ నము. రెంటిని కలుపుకొని జీవించుటయె మానవుని విశిష్టత.

("యోగక్షేమ" - ఆధారముతో)

## గీతార్ణవము  పి. హనుమంతరెడ్డి.

మ॥ విమనస్కోరగ రజ్జుకీలితమునై బీభత్స మంథాద్రి సం
తమసాగాధ విషాదవార్ధిమునుగన్ తా కూర్మమై లేపి నే
రిమి పత్సద్వయి నూని త్రచ్చుచు పసన్ రేకెత్తు దివ్యోపదే
శమునన్ దేర్చి తరింపజేసె నరునిన్ చైద్యారి గీతాసుధన్ ॥

మ॥ ఒడిరాల్గట్టి మహాబ్ధిముగ్గి రతనాలువ్వెత్తుగా నెత్తుకై
వడి కర్తవ్యవిమూఢగాఢశిలలన్ స్వాంతమ్మునన్నించి క
వ్వడి ప్రారబ్ధ విషాదవార్ధి మునకల్ నాటించి దైవేచ్ఛమై
తడవెన్ జన్మకృతార్థతన్ వడసె గీతారత్న రాజమ్ములన్ ॥




(గతసంచిక 12_వ పేజీ తరువాయి.)

భగవద్గీత నాల్గవ అధ్యాయము నందలి "కర్మణ్యకర్మ యః పశ్యేత్" అనెడి ప్రసిద్ధ శ్లోకమును గురించి యింతవరకు విమర్శించుకొని యున్నాము. తర్వాత భగవంతుడు అర్జుననకేమని ఉపదేశించుచున్నాడో విచారింతము.

"అర్జునా! ఎవడు కామసంకల్ప రహితములగు ప్రవృత్తులు కలవాడై యుండునో, జ్ఞానాగ్నిచే యెవని కర్మపుంజము దగ్ధమైనదో, అట్టివానిని బ్రహ్మాత్మైక్య నిశ్చయముగల తత్త్వవేత్తలు పండితుడని చెప్పుదురు."

ఇచ్చట పండితుడను మాటకు అర్థమేమి? "పండా" యనిన విలక్షణమును అంతిమము నగు బుద్ధి. "ఇతా" యనిన అట్టిబుద్ధి యెవనికి అంతిమ జన్మకారణముగ సిద్ధించినదో అట్టివానిని పండితుడందురు. మరొక్కమాటలో పండితుడనిన జ్ఞానియని అర్థము. అట్టి పండితుడు గడచిన 18_వ శ్లోకమునందు చెప్పిన పరమార్థ దృష్టి కలవాడై యుండును. వాడొనర్చు లౌకిక వైదిక క్రియాప్రవృత్తులన్నియు కామసంకల్ప విరహితములై యుండును. కామమనిన స్వర్గాది ఫలకాంక్ష. సంకల్పమనిన "నేను కర్మనొనర్చువాడ" ననెడి కర్తృత్వాభిమానము. కామ సంకల్పములు లేనివాడొనరించెడి పనిపాటలన్నియు లోకసంగ్రహార్థమై కాని, జీవయాత్రా నిర్వాహణమాత్రమై కాని, ప్రారబ్ధభోగానుభవమునకై కాని ప్రవర్తించును. వానియొక్క శుభాశుభ కర్మవాసనలన్నియు జ్ఞానమనెడి ప్రసిద్ధమగు అగ్నిచే దహింపబడినవి. గత శ్లోకమునందు చెప్పినట్లు, ప్రపంచరూప కర్మమందు సత్తాస్ఫూర్తిరూపమై యుండు చైతన్య బ్రహ్మమనెడి అకర్మను

దర్శించుటయు ఆ అకర్మయందు ప్రపంచమనెడి కర్మను కల్పితరూపమున దర్శించుటయు "జ్ఞాన" మందురు. ఈ జ్ఞానమె కర్మరాశిని దగ్ధమొనర్పజాలెడి మహాగ్ని.

ఈ విషయమునందు శ్రీవ్యాస భగవంతుడు, "తదధిగమ ఉత్తర పూర్వాఘయోరశ్లేషవినాశౌ తద్ వ్యపదేశాత్" అని బ్రహ్మసూత్రములలో చెప్పియున్నాడు. అనగా ఆ పరమాత్ముడే తన ఆత్మయని సాక్షాత్కార మొనర్చుకొనిన యనంతరము వానిచే నొనర్పబడు పుణ్యపాప కర్మములు అతనికి సంబంధింపబడవు. సాక్షాత్కారమునకు ముందతడొనర్చిన సంచిత కర్మములు జ్ఞానాగ్నిచే దగ్ధమైనవి. ఈ విషయము సర్వశాస్త్ర విదితము. అట్టివానిని బ్రహ్మవేత్తలగు బుధులు పండితుడని పల్కుదురు.

మరొకవిధమున చూచినచో సర్వత్ర బ్రహ్మచైతన్యమును దర్శించెడి అంతఃకరణవృత్తిని "పండా" అందురు. అట్టివృత్తి యెవని అంతఃకరణమున సంభవించినదో వానిని పండితుడందురు. లోకదృష్టి ననుసరించి చూచినను సమ్యగ్దృష్టికలవాడె పండితు డని పించుకొనును. కాని విపరీతదృష్టి కలవాడుపండితుడనబడడు. ఆసమ్యగ్దృష్టి జ్ఞానియందె సంభవించును కాని అజ్ఞానియందు సంభవింపనేరదు. కాబట్టి జ్ఞానముకలవానినె పండితు డనజెల్లును.

ఈచోట నొక శంకకు అవకాశము కలదు. "ముందొనరించిన కర్మలు జ్ఞానాగ్నిచే దగ్ధము కావచ్చును. ఆగామికర్మలకు ఉత్పత్తి లేకపోవచ్చును. అయినను జ్ఞానోత్పత్తికాలమున చేయబడెడి కర్మలు,పూర్వకర్మములకునుఉత్తర కర్మములకును చెందవు కాబట్టి వాటి ఫలమును జ్ఞాని అనుభవింపవలసిన పనిలేదా?" యనెడి శంకకు మీాదటి యిరువదవ శ్లోకమున భగవంతుడు సమాధానము చెప్పుచున్నాడు.

"అర్జునా! కర్మముయొక్కయు ఫలముయొక్కయు గాఢసంగమును వదలి నిత్యతృప్తుడును నిరాశ్రయుడునైన జ్ఞాని కర్మములందు ప్రవర్తించుచున్నను ఏమియు చేయనివాడె యగుచున్నాడు."

నిత్యనైమిత్తికాది కర్మములను చేయువాడను — చేసినవాడ ననెడి కర్తృత్వాభిమానమును కర్మసంగ మందురు. వాటికి ఫలమగు స్వర్గాది భోగముల నపేక్షించుటను ఫల

సంగమందురు. ఆ రెంటిని ఆత్మ అకర్త అభోక్తయనెడి జ్ఞానముతో పరిహరింపవలెను. అట్టివాడు నిత్య తృప్తుడు కాగలడు. పరమానంద స్వరూప లాభమువలన సర్వపదార్థములందు ఆశలేనివాడు కాగలడు. మరియు నతడు నిరాశ్రయుడు కాగలడు. అద్వైతాత్మ దర్శన సాక్షాత్కారమువలన దేహేంద్రియాద్యభిమానాశ్రయమును వదలును. అట్టి జీవన్ముక్తుడు ప్రారబ్ధ కర్మవశమున లోకదృష్టి ననుసరించి లౌకిక వైదికకర్మములను సాంగోపాంగముగ నొనర్చుచున్నట్లున్నను పరమార్థదృష్టి ననుసరించి ఏమియు చేయనివాడె యగుచున్నాడు. నిష్క్రియాత్మ సాక్షాత్కార బలమున అతని సర్వకర్మములును బాధింపబడినవి. నిత్యతృప్తుడు — నిరాశ్రయుడనెడి రెండు విశేషణములును జ్ఞానికిచెందిన లక్షణములు. ఫలసంగ నివృత్తివలన నిత్యతృప్తియు, కర్మసంగ నివృత్తివలన నిరాశ్రయత్వమును సంప్రాప్తము కాగలదు.

జ్ఞానికి ఫలాసక్తి లేదు; కారణమేమనిన — ఆయన నిత్యతృప్తుడు. ఫలాసక్తి కలవాడెన్నడును నిత్యతృప్తుడు కాజాలడు. నిత్యతృప్తి లేకుండుట అజ్ఞానిలక్షణము. జ్ఞానికి కర్తృత్వసంగము లేదు; కారణమేమనిన అతడు నిరాశ్రయుడు. కర్తృత్వాభావము కలవాడెన్నడును నిరాశ్రయుడు కాబోడు. అట్టివాడె అజ్ఞాని.

సమ్యక్ జ్ఞానప్రభావమున విక్షేపహేతువులగు జ్యోతిష్టోమాది కర్మలు సైతము బంధకరములు కాజాలవని చెప్పినప్పుడు, శరీర నిర్వాహణమాత్రమునకై యొనర్చెడి సహజకర్మములుగాని, భిక్షాటనాది యతికర్మములుగాని, నిరహంకారపూర్వకముగ నొనర్చెడి లోకసంగ్రహ కర్మములుగాని బంధహేతువులు కానేరవని చెప్పవలసిన పనియె లేదు.

శరీర నిర్వాహణమునకై యొనర్చెడి కర్మలు ఆత్మజ్ఞానికి కిల్బిషము నాపాదింపజాలవనెడి విషయమును ప్రకారాంతరమున భగవంతుడు చెప్పుచున్నాడు.

“కిరీటీ! అంతరింద్రియ బహిరింద్రియ సహితముగ శరీరమును వశమునందుంచుకొని, భోగసామగ్రులను సంగ్రహించుకొనుట లేనివాడై యుండునతడు, శారీరకయాత్రకొరకుగా కర్మములు చేసినను వాటిపాపములకు గురికాడు.”

లౌకిక భోగవస్తువులపై ఆధార పడి యెవ్వడులేడో, భోగ సుఖములకై దేబరింపనివాడెవ్వడో, సర్వవిధములగు యిచ్ఛా వాసనా కామనలు యెవ్వని వదలిపోయినవో, అట్టివానిని "నిరాశీ" యందురు. మనస్సును యింద్రియములును రాగద్వేష శూన్యములై ప్రవర్తించుటబట్టి యెవనిపై శబ్దాది విషయములు తమ ప్రభావమును జూపలేవో, అట్టివాడు గృహస్థుడగుగాక, సన్న్యాసియగుగాక, వానిని "యతచిత్తాత్మ"డందురు. ఎట్టి వస్తువునందును మమకారమెవ్వనికుండదో, భోగ వస్తుసామగ్రులను కూర్చుకొనెడి సంగ్రహబుద్ధి నెవ్వడు పరిత్యజించియున్నాడో — అట్టివానిని త్యక్త సర్వపరిగ్రహుడందురు.

ఈ మూడు విశేషణములను ప్రయోగించుటతో తేలిన సారాంశమేమిటి? బాహ్యవస్తువులయొక్క సంబంధములేక నిరంతరము తనయందె తాను సంతృప్తినొందుచు, యజ్ఞదానాది వివిధ కర్మముల ఫొంతకు పోక, శరీర నిర్వహణమునకు వలయు ఆహారవిహారముల నాచరించెడి జ్ఞాని పాపమునకు గురి కాడు. అట్టివానికి ప్రత్యవాయాది దోషములు సంభవింపవు. ఎందుకనిన — అతని కర్మత్యాగము ఆసక్తివలనకాని, ఫలాసక్తివలనగాని, అహంకారపూర్వకముగగాని, మోహావశమునగాని చేసినది కాదు. ఆతని త్యాగము శాస్త్ర సమ్మతమై యుండుటబట్టి అన్ని విధములను అది లోకమునకు హితమును చేయునదియె యైయున్నది.

శారీరం — కేవలం అనెడి విశేషణములతో కూడిన కర్మ యీ శ్లోకమున చెప్పబడినది. అదెట్టిది? కిల్బిషమనిన పదమునకు అర్థమేమి? కిల్బిషమును పొందడనిన మాటలోని ఆంతర్యమేమి? వీటినిగురించి విచారించుకొందము.

శారీరం కేవలం కర్మ — అనునది సన్న్యాసిపరమైనచో, కేవల శరీర నిర్వహణార్థమగు భిక్షాది కర్మముల గ్రహింపనగును. గృహస్థపరమైనచో, శౌచ స్నాన ఆహార విహార శయనాసనాదికములై జీవితావసరములై యుండు కర్మముల నర్థము చెప్పుకొనవలెను. "కిల్బిష" మనిన పాపము. నిత్య నైమిత్తిక యజ్ఞదానాది విహిత కర్మములను వదలుటవలన కలిగెడి ప్రత్యవాయదోషమును, సహజమగు శారీరక క్రియలవలన అనివా

ర్యముగ నేర్పడు ప్రాణిహింసాది దోషమును యిచ్చటి కిల్బిష పద మునకు ద్యోతకములు. ఆ రెండు దోషములతనిని ముట్టజాలవనుటనె కిల్బిషమునకు పాత్రుడు కాడని చెప్పబడినది.

"ధనంజయా! ఎవడు యదృచ్ఛాలాభ సంతుష్టుడో — ఎవడు ద్వంద్వముల కతీతుడో — ఎవనికి మాత్సర్యము లేదో - సిద్ధియందును అసిద్ధియందును సమభావము గల వాడెవడో వాడు కర్మముల నొనర్చుచున్నను బంధమునకు లోనుకాడు."

ప్రారబ్ధముకొలది అనిచ్ఛవలననో పరేచ్ఛవలననో ప్రాప్తించిన అనుకూల ప్రతికూల వస్తువులందు రాగద్వేషములులేక సదా సంతుష్టుడై యుండువానిని యదృచ్ఛాలాభ సంతుష్టుడందురు. ఆ రెండును భగవదిచ్ఛతో కల్గుచున్నవని కాని, ప్రారబ్ధకర్మమున యేర్పడుచున్నవనిగాని భావించి నిరంతర శాంతిపరాయణుడై ప్రసన్నచిత్తము నుండుటె యదృచ్ఛాలాభ సంతుష్టి యందురు.

పురుషార్థమును - ప్రయత్నమును మాని, సోమరియై జడప్రాయముగానుండు మూఢుని యదృచ్ఛాలాభ సంతుష్టుడనుట పొసగదు. సంతృప్తి జ్ఞానికె లభింపగలదుగాని; సోమరికెన్నడును లభింపదు. సోమరిహృదయము అశాంతితో - అతృప్తితో కళవెళ ఉడుకుచుండును. స్వార్థబుద్ధి మిగిలియున్నంతకు కోరికలు చల్లారవు. కోర్కెలు చల్లారువరకు తృప్తిలభింపదు.

హర్షశోకములు — సుఖదుఃఖములు - లాభనష్టములు - జయాపజయములనెడి ద్వంద్వములయొక్క ప్రభావమెవ్వని అంతఃకరణముపై పెత్తనము చెలాయించలేదో అట్టి వానిని ద్వంద్వాతీతుడందురు.

మాత్సర్యము లేనివానిని విమత్సరుడందురు. పరులయొక్క విద్యాధనకీర్తి వైభవ ప్రతాపములచూచి ఓర్వలేనితనమును మత్సరమందురు. ఇదిచాల తుచ్ఛగుణము. ఇట్టిది లేనివాడె విమత్సరుడు. బుద్ధిమంతుడనని విద్యావంతుడనని తన్నుతాను భావించువారియందు ఈ మాత్సర్యము సూక్ష్మరూపమున నుండును. మిత్రులయెడ కుటుంబముయెడ మత్సరబుద్ధి కల్గి కొందరుందురు. జ్ఞాని దానికి దూరమైయుండునని సూచించుటకై విమత్సర శబ్దము ప్రయోగింపబడినది.

యజ్ఞతపోదానాదికములగు కర్తవ్యకర్మములు నిర్విఘ్నముగ ముగిసినచో సిద్ధియందురు. తప్పినచో అసిద్ధియందురు. ఇష్టము నెరవేరినచో సిద్ధి; కానిచో అసిద్ధి. సిద్ధియెడ మోదము, అసిద్ధియెడ ఖేదము బొందుట సామాన్యుల లక్షణము. కాని ముందు చెప్పిన కర్మాకర్మ తత్త్వజ్ఞాని సిద్ధియందును అసిద్ధియందును సమభావము కల్గినవాడై యుండును.

"కృత్వాపి న నిబధ్యతే" - అట్టివాడు అన్నికర్మలు చేయుచున్నను బంధమునకు లోబడడు. రెండవ అధ్యాయము నలుబది యేడవ శ్లోకమునందు కర్మమొనర్చుటయందు మానవునకధికారము గలదని చెప్పబడినది. మానవుడే కాదు; సృష్టియందలి ప్రతివస్తువును కర్మ చేయుచునే యున్నది. సృష్టికిని కర్మకును అవినాభావ సంబంధము. సృష్టియె కర్మ; కర్మయె సృష్టి. ప్రజాపతి బ్రహ్మదేవుడు కర్మతో జతగూర్చియే ప్రాణులను సృష్టించి యున్నాడు. అవశ్యకర్తవ్యముగ జేయవలసిన కర్మమును మానినచో మానవుడు పాపమునకు గురికాగలడు. అసలు - మానియుండుటకు వీలేలేదు. తన ప్రకృతికి అనుగుణ్యమగునదేదియో ఒకటి చేసియె తీరవలెను. కాని యీ నియమము సాంఖ్యయోగికి అన్వయింపదు. ఆతడు పరిగ్రహరహితుడై కేవలము శారీరసంబంధమగు కర్మములమాత్రము చేయును. అన్యకర్మముల మానుటవలన కలిగెడి పాపమతనికి అంటదు. ఇట్లే కర్మయోగి సైతము విహితకర్మములను మానుటవలన పాపబద్ధుడు కాడు.

అట్టివాడొనర్చు కర్మముల పరిణామమేమి కాగలదనుటనుగూర్చి మీదటి యిరవై మూడవ శ్లోకమున భగవంతు డుపదేశించుచున్నాడు.

అర్జునా! ఫలాభిలాషను వదలియెవని చిత్తము జ్ఞానమందు నిలిచినదో-అట్టివాడు లోకసంగ్రహార్థమై చేసెడి కర్మములు ఫలసహితముగ బ్రహ్మమునందు విలీనమగుచున్నవి. అజ్ఞానావరణశక్తియనెడి సంచితకర్మయొక్క ఆశ్రయమును, అహంకారమునకు సాక్షితోడ నేర్పడిన అన్యోన్యాధ్యాస యనెడి భ్రమజ తాదాత్మ్యరూపముననుండెడి క్రియమాణకర్మయొక్క ఆశ్రయమును ఫలవాసనా సహితముగ లయించి పోవుచున్నవి. ఆ లయము నీటియందు రాతివలెగాదు. ఉప్పుకల్లువలె లీనమగుచున్నది.

గతసంగుడనిన స్వర్గాది ఫలములందు అపేక్షలేనివాడని అర్థము. ముక్తుడనిన కర్తృత్వభోక్తృత్వ సంబంధమగు అధ్యాస లేనివాడని యర్థము. జ్ఞానావస్థిత చేతస్కుడనిన తత్త్వమస్యాది మహావాక్యశ్రవణమువలన కల్గిన అఖండ బ్రహ్మాత్మ జ్ఞానము చిత్తమందు కలవాడని అర్థము. ఈ మూడును స్థితప్రజ్ఞునకు చెందిన లక్షణములు. ఈ మూడు విశేషణములును వరుసగా ఒకదాని కొకటి హేతువులైయున్నవి.

కర్మయందు అకర్మను చూచెడి వివేకి ఫలాభిలాషయనెడి సంగము లేనివాడు. అనగా గతసంగుడని భావము. గతసంగుడెందుకు కాగల్గెను? ముక్తుడు కాబట్టి. అజ్ఞానివలె కర్తృత్వ భోక్తృత్వముల నారోపించుకొనక వాటినుండి విముక్తుడై యున్నాడు కాబట్టి.

అవివేకకర్తృత్వభోక్తృత్వాదుల నుండి విముక్తుడగుటకు కారణమేమనిన — జ్ఞానావస్థిత చేతస్కుడు కాబట్టి. జ్ఞానావస్థిత చిత్తము లేనివాడు కర్తృత్వభోక్తృత్వరూపమగు అధ్యాసనుండి విడివడలేడు.

అట్టి బ్రహ్మవేత్త ప్రారబ్ధకర్మ వశమునగాని, సామాన్య మానవులకు ఆదర్శమును కాపాడుటకై గాని, యజ్ఞస్వరూపుడగు విష్ణుభగవంతుని ప్రసన్నతకై గాని నానాకర్మముల జేయుచున్నను, ఆ కర్మరాశి యంతయు సమగ్రముగ నశించుచున్నది.

ఇచ్చట అగ్రమనుటకు ఫలమని అర్థము. సమగ్రమనిన ఫలసహితముగనని యర్థము. తత్త్వసాక్షాత్కార బలమున అవిద్యయనెడి కారణము నిర్మూలమైనంతట జ్ఞాని యొక్క కర్మములు ఫలసహితముగ నశింపగలవు.

“తద్యథేషీకతూలమగ్నౌ ప్రోతం ప్రదూయేతైవం — హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే” — అని శ్రుతిచెప్పినది. ధగద్ధగమండెడి అగ్నియందు గడ్డిపోచవలె జ్ఞానాగ్నియందు పుణ్యపాపకర్మములన్నియు దగ్ధములై పోగలవు. “జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే” — యని గీతాచార్యుడు సైతము చెప్పియున్నాడు.

ఇంతకు సారాంశమేమనిన — ఆసక్తియనెడి దోషమునుండి విడువబడినవాడె ముక్తుడు. వాని చిత్తమె జ్ఞానమునందు స్థిరము కాగలదు. వాడొనర్చు ప్రతిపనియు యజ్ఞమె. లోకసంగ్రహబుద్ధిని — పరమార్థ భావనను అవలంబించి వాడొనర్చెడి

(మిగత 20-వ పుటలో)

# గీతాప్రసాదం

ఆచార్య శ్రీధర్, మచిలీపట్టణం.

ప్రతిమానవుడు ఒక దివ్య సుఖాన్ని, అమరానందాన్ని అనుభవించాలని అభిలషిస్తాడు. తన జీవితం దుఃఖపూరితం కావాలని, బాధాకంటకనిలయం కావాలని ఎవడూ వాంఛింపడు. అతనివాంఛ ఎప్పుడూ మధురమైన సౌఖ్యాన్ని పొందాలని ఉవ్విళ్ళూరుతూ ఉంటుంది. ఈ సౌఖ్యమును రెండువిధములుగా పొందవచ్చును. బాహ్యమైన ప్రకృతి ఆకృతిని తిలకించి, మోహమునొంది, దానిలో సౌఖ్యాన్ని అనుభవించాలని తలచి, క్షణభంగురమైన లాభదాయకం కాని సుఖాలను అనుభవించటం ఒకవిధం. క్షేత్రజ్ఞుడై, ఆత్మసంస్కారం కలిగి, మనోనిగ్రహతనుపొంది, కర్మఫలితముకోరని పవిత్ర ప్రేమదృష్టితో సర్వభూతములను సమదృష్టితో చూచెడి మానవుడు తన జీవితాంతానికి– జీవితకాలంలోనూ అలౌకిక బ్రహ్మానందాన్ని – నిరంతరమధుర సుఖమాధుర్యాన్ని ఆస్వాదించటం మరొక పద్ధతి.

ఈ పద్ధతులలో రెండోపద్ధతి విశుద్ధమైనది. మొదటిది క్షణభంగురమగుటవలనను, కష్టనష్ట పరంపరలకు దారితీయు అవకాశములుండుటవలనను, అది ఎవనికిని పనికిరాదు. దానిలో సౌఖ్యంలేదు. ఆ సౌఖ్యంమాత్రం నళినపత్రముపైనున్న జలబిందువే. ఓంకారస్వరూపములో ఐక్యమైపోవటమనే ఆ మోక్షాన్ని లేక నిర్వాణాన్ని లేక పరినిర్వాణాన్ని మానవుడు సదాచార సంపత్తివలనను, సంస్కారంవలనను పొందకలిగినప్పుడు ఆ ముక్తి లేక ఆ అంత్యదివ్యసోపానం నిరంతరమైన నిశ్చలసుఖాన్ని పొందింపజేయగ దానికి మించిన ఆనందంమరొకటి ఏమున్నది? అని ప్రశ్న. ఏమీ లేదని ఆత్మ జవాబిస్తూ ఉంటుంది.

ఆ మహత్తర ముక్తిసుఖాన్ని పొందుటకు ఏ విధమైన ఏర్పాట్లు భగవద్గీతలో కృష్ణపరమాత్మ చేసినాడో, ఆ ఏర్పాట్లే, ఈ జనన మరణములనే భావాలుకల్గిన ధరావలయంలోకూడ సుఖాన్ని, ఆనందాన్ని చేకూరుస్తాయి అనే భావాన్ని స్పష్టం చేయబోతాను.

భగవద్గీతలో బ్రహ్మపదార్థములో ఐక్యమైపోవుటకు శ్రీ కృష్ణభగవానుడు సిద్ధాంతీకరించిన ముఖ్యపద్ధతులు.

శ్లో॥ తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర ।
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ॥

(కర్మయోగము 19 శ్లోకము)

ఓయీ! అర్జునా! ఫలసంగవర్జితుడవై విధి దృష్టవిధానముగా విహిత కర్మలనాచరింపుము. ఎందువలననగా ఫలాపేక్ష లేక సత్కర్మల నొనరించువారు మోక్షమును పొందుచున్నారు. కాన మోక్షార్థివై విధిలేక కర్మలనాచరింపుము. దీనివలన కర్మలు చేయుచూ దానిఫలితమును విసర్జించినకర్త మోక్షప్రాప్తి కర్హుడని స్పష్టమగుచున్నది.

ఇంకను గీతయందు కొన్ని శ్లోకములు కామ, క్రోధ, లోభ, మోహాదులకు లోబడుటవలన మోక్షము సంభవింపదని చాటుచున్నవి. హృదయ నిర్మలతకు, మనో నిగ్రహమునకు గీత ప్రాధాన్య మిచ్చినది.

శ్లో॥ సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః।
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహం॥

(రాజవిద్యారాజగుహ్యయోగము 29 శ్లో.)

హే ధనంజయా! నేనెల్లభూతములకు సముడను. నాకు ఇష్టుడుగాని, అయిష్టుడు గాని లేరు. ఎవడు భక్తిశ్రద్ధలతో నన్ను భజింపుచున్నాడో అట్టివాడు నాయం దున్నాడని, నేను వానియందున్నానని నమ్ముము.

ఈ శ్లోకమువలన భగవానుడు సముడని, పక్షపాతరహితుడని తెలియుచున్నది. మరియొక శ్లోకమున ఎవడు సమస్తభూతములయందు సమదృష్టితో వర్తించునో వాడు మోక్షార్హుడని చెప్పబడినది. భగవానుడు సర్వసమత్వమునకు, ప్రేమతత్వమునకును ప్రాధాన్యమిచ్చినాడు. మోక్షసాధనకు కడంగుటయందు పవిత్రప్రేమతత్వమును అనుస రించుట ముఖ్యకర్తవ్యము.

శ్లో॥ యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి।
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్యస్స మే ప్రియః॥

(భక్తియోగము 17 శ్లోకము)

ఎవడు సంతోషమునకును, ద్వేషమునకును, దుఃఖమునకును, ఆశకును, శుభాశుభ ములకును అతీతుడై నన్ను భక్తితోభజించుచున్నాడో వాడు ముక్తిని పొందగలుగును. ఈ శ్లోకము ద్వంద్వాతీతస్థితిని ప్రబోధించుచున్నది.

ఈ విధముగా నతడు జ్ఞానవిషయంలో, కర్మవిషయంలో, భక్తివిషయంలో, మరికొన్ని ఇతరవిషయాలలో ఏ విధముగా ముక్తినిపొందగలమో చక్కని సలహాల నిచ్చినాడు.

ప్రతిమానవుడు కర్మవిషయంలో, ధర్మకర్మల ననుసరించుటయందు ఫలితాతృష్ణ విసర్జించినవాడై వర్తించునో వాడు దివ్యసుఖమును పొందగలుగును. ఫలితంపై ఆశలు కలవాడు ఆడంబరంతో ప్రతిపనిని చేస్తూంటే "ఈ పని నేనే చేస్తున్నాను" అన్న అహంభావము ఉద్భవిస్తుంది. ఆ ఉద్భవించిన అహంకారమువలన గర్వమేర్పడుతుంది. దానివలన "ఇతరులు నేను చేసినపనిని చెయ్యలేరుకదా!" అని ఇతరులను తేలికగా చూచి, వారిని అనగద్రొక్కాలనే ద్వేషంతోకూడిన కామం బయలుదేరుతుంది. దీని వలన క్రోధాదులు ఆవిర్భవిస్తాయి. కామక్రోధాదులవలన మానవునికి సుఖంలేదు గనుక, అహంభావముతో చేసిన కర్మ అసుఖాన్ని చేకూరుస్తుంది గనుక, సుఖాన్ని చేకూర్చే అహంభావములేని, ఫలితమునందు ఆసక్తిలేని కర్మలననుసరించటం చాల ఉత్తమం. కర్మ సంగవిసర్జనవలన ఈ ధరణిలోనే ఆనందాన్ని అనుభవింపగలుగుతాం. భగవానుడు కామ, క్రోధాదులు మోక్షమార్గంలోని ఆటంకకంటకాలని చెప్పాడుకదా! వాటిలో

సుఖంలేదని తెలిసికొనిన అనంతరము, కామక్రోధాది విసర్జనవలన సుఖం ఈ లోకంలోనే చేకూరుతుందని విశదమౌతుంది. నిగ్రహనిర్మలతలను గురించి చెప్పిన విషయంలో ఒక వేళ నిగ్రహరహితుడై తన తుచ్ఛకామాల్ని తీర్చుకొనుటకు ప్రయత్నించినట్లైన, దానికి ఫలితంగా జీవితంలో అశాంతిని రేకెత్తే క్రోధాదులు ఉద్భవిస్తాయి క్రోధాదులు ఉద్భవించిన కారణంగా జీవితమశాంతిమయమై పోతుందిగాని, నిగ్రహముతో మోక్ష సాధనకు కడంగుటవలన ఈ ప్రపంచంలోనే దివ్యమైన ఆనందాన్ని పొందకలుగుతాడు. నిర్మలత [illegible] అంతే. నిర్మలత లేనియెడల అంతఃకరణమతని అధీనములోనుండక చపల చిత్తుడుగామారిపోతాడు. చపలచిత్తుడై ప్రతివిషయాన్నుచూచి, భ్రమించి, మోహించి అజ్ఞానాంధకార అగాధంలోపడి, దివ్యజ్యోతి సందర్శించుట కర్వుడుకాలేకపోతాడు. అనిర్మలత ప్రతివాని నిత్యకృత్యములలోనే జీవితము నశాంతిపూరితం చేస్తుంది. నిర్మలతకూడ ఇలా ఇక్కడే మనకు సుఖాన్ని చేకూరుస్తుంది.

భగవానుడు ప్రేమతత్త్వమునకు ప్రాధాన్యమిచ్చినాడు. మనం సృజింపబడిన ప్రతి జీవిని ప్రేమించటం నేర్చుకుంటే ఎంత ఆనందాన్ని అనుభవింపగలుగుతాం. ఆ సుఖం పవిత్రప్రేమలేక, ప్రతివానిని ఈర్ష్యా, అసూయ ద్వేషాదులతో చూస్తూ జీవితాన్ని గడిపితే ప్రేమిస్తున్నవానిసుఖాన్ని అతడు అనుభవింపకలుగుతాడా? అనుభవింపలేడు. తరువాత కష్టసుఖములను, శుభాశుభములను సమానదృష్టితో ఎవడు చూచునో వాడు కష్ట, అశుభ సమయములందు విచారంలో క్రుంగిపోడు. శుభ, సుఖసమయములందు సంతోషపరవశుడై పొంగడు. ద్వంద్వములయొక్క ఏకత్వాన్ని సాధించిన అతనికి దుఃఖం ఎక్కడఉన్నది? సమదృష్టిని సాధించటంవలన విచారమనేది అతనికేమాత్రములేదు. భగవానుడు విజ్ఞాన యుతమైన జ్ఞానమునకుకూడ ప్రాధాన్యమిచ్చినాడు "నేను ఎవడను?" అను ప్రశ్న వేసికొని, తాను ఎవరో తెలిసికొని, జ్ఞానవంతుడై, ప్రపంచక్షణభంగురములైన సుఖములను విసర్జించి, తనను జన్మింపజేసిన మూలపురుషుని ధ్యానం చేస్తూ, రాగద్వేషాది ద్వంద్వములకు అతీతుడై జ్ఞానయోగి సుఖించుచున్నాడు. ఆతనిలో సమత్వము సాధించి కామక్రోధాది విసర్జనచేసి, పరమాత్మనందాత్మను సంధానించి అఖండ ఆనందమును పొందగలుగును.

భగవద్గీతలో భగవానుడు ప్రబోధించిన ప్రతివిషయము ప్రతివ్యక్తికి పరలోకంలోనేగాక, ఇహలోకంలోకూడ సుఖాన్ని ఆనందాన్ని ప్రసాదిస్తుంది. భగవద్గీతలో చెప్పిన ప్రతివిషయమును అవగాహనచేసికొని, నిత్యజీవితంలో ప్రవేశపెట్టిననాడు అందరూ జ్ఞానులుగా, స్థితప్రజ్ఞులుగా మారిపోతారు. వారి హృదయమెప్పుడు శాంతి ప్రపూరితమౌతుంది. శాంతికోరే శాంతిని అనుభవించేవారు, ప్రపంచంలోని అజ్ఞానజనిత అశాంతిని పాతిమార్చి శాంతివలయాలకు, శాంతినిలయాలకు ఆలవాలం చెయ్యగలరు. కాబట్టి మనమంతా వారుగా మారటానికి యత్నిద్దాం. ఆ యత్నంలో గీతావాణి ఆశీర్వాదపాణి మనకు ధైర్యస్థైర్యాల్ని ప్రసాదిస్తున్నది. ఆ ప్రసాదాన్ని స్వీకరించి మనం ముందుకు నడుద్దాం. గీతావిజ్ఞానవీధులలో విహరిద్దాం. పరిజ్ఞానపరుధులలో సంచరిద్దాం.

ఓం తత్సత్.

ఓమ్

# భక్తియోగము

## ప్రార్థనాప్రభావము,

రచనః- స్వామి శ్రీ శివానంద సరస్వతి

అనంత శాస్త్రం బహు వేదితవ్యమ్
స్వల్పశ్చ కాలో బహవో హి విఘ్నాః
యత్సారభూతం తదుపాసితవ్యమ్.

శాస్త్రములు తుదిలేనివి. తెలిసికొనవలసినది ఎక్కువయున్నది. కాలమా స్వల్పము, ఇక్కట్టులా బహుళములు. జలక్షీర మిశ్రణము నుండి క్షీరసారమును మాత్రమే హంసము ఎట్లు పరిగ్రహించునో, అట్లే ఏది సారాంశమో దానిని పరిగ్రహింపవలెను. ప్రేమ లేక భక్తియే అట్టి సారము. ఈ సారమును పానముసల్పి శాంతి, అమృతత్వములనెడి శాశ్వతపదమును పడయుము.

ప్రార్థన మనస్సును ఉన్నతపఱచును. అది మనస్సును సత్త్వముతో పూరించును. అది దేవుని స్తుతితో సంయోగమైయున్నది. అది మానసమును భగవదనుసరణముగఁ జేయును. హేతువు ప్రవేశించుటకు సాహసింపని ప్రదేశమును ప్రార్థన దరియఁగలదు. ప్రార్థన పర్వతములను ప్రచలనము గావింపఁగలదు. అది ఆశ్చర్యావహాకములైన కార్యముల నొనరింపఁగలదు. అది భక్తుని మృత్యుభయమునుండి ముక్తునిఁజేయుచు, వానిని దైవసామీప్యమునకుఁ గొంపోవుచు, వానిని సర్వత్ర దైవ సమ్ముఖమును ప్రజ్ఞాపూర్వకముగ నరయునటుల నొనరించును. అది వానిలో దివ్యచైతన్యమును ప్రబుద్ధముగావించి, తనను పరమార్థమైనట్టి అమృతమానందస్వరూపమును తాను ప్రజ్ఞాపూర్వకముగ తెలిసికొనునటులఁ జేయును.

ప్రహ్లాదుని శిరముపై సలసల కాగుచున్న తైలము ప్రవమ్మరింపఁ బడినపుడు దానిని తుహినతుల్య శీతలముగ పరిమార్చినది వాని ప్రార్థనయే. చీలల పడకను గులాబుల శయ్యగను, నాగుపామును పూల మాలగను పరిమార్పఁజేసినది మీరాదేవి ప్రార్థనయే.

ప్రార్థన అత్యంత విస్మయకరమైన ప్రభావ సంపన్నమైనది. శ్రీ గాంధీమహాత్ములు ప్రార్థనా మహావ్రతులు. ప్రార్థన మనఃపూర్వకమై, నీ హృదయపీఠము (అంతరికము)నుండి ప్రోద్భవమైనచో అది తత్క్షణమే ఈశ్వర హృదయమును ద్రవితము (కరుణావిష్టము) చేయును. ద్రౌపదీ దేవియొక్క హృదయావేదిత (ఆర్త) ప్రార్థనను ఆలించగనే శ్రీకృష్ణుఁడు ద్వారకాపురినుండి రిక్తపాదచారియై పరుగిడవలసి యుండెను. మీకెల్ల రకును ఇది విదితమే, విజ్ఞాతమే. ప్రహ్లాదుడు ప్రార్థించినపుడు కొంచము ఆలస్యముగ వచ్చినందులకు ఈ విశ్వమహాపాలకుఁడైన సాక్షాత్ శ్రీహరి ప్రభువు ప్రహ్లాదుని ఎదుట మన్నన వేడికొనెను. ఆహా! భగవానుఁడెంత కరుణామయుఁడు! ఎంత ప్రేమమయుఁడు!!

నీ అంతఃకరణ పీఠమునుండి ఒక్కసారైనను ఇట్లు వేడుము. "ఓ స్వామీ, నేను త్వదీయుఁడను. తవైవాహం, యుష్మత్సంకల్పమే వర్తిలుగాక. నాపై కరుణావిష్టుఁడవగుము. నేను త్వద్భృత్యుఁడను, భవద్భక్తుఁడను, క్షమింపుము. పథముఁజూపుము. రక్షింపుము. జ్యోతి నిమ్ము. త్రాహే, ప్రచోదయాత్." ప్రశాంతకరమైన స్వీకరణ మనః ప్రవృత్తిని కలిగియుండుము. నీ హృదయమున భావమును ఉంచుకొనుము. ప్రార్థన వెనువెంటనే ఆలింపఁబడును, ప్రతీకారము చేయఁబడును. అను దిన జీవితసమరమున దీనినాచరించి, స్వతఃగ నీకునీవే ప్రార్థనయొక్క మహా ప్రయోజనశక్తిని తెలియుము. నీవు అప్రతిహతమైన ఆస్తిక్య బుద్ధి (పరమేశ్వరుని ఉనికవయందు పటిష్ఠమైన నమ్మకము) సంపత్సం పన్నుఁడవు కావలయును.

ఈశ్వరునినుండి నానావిధములైన లాంఛనములను, ఈవులను పొందుటకొఱకు క్రైస్తవులు భిన్నప్రార్థనలను పెట్టుకొని యున్నారు. సూర్యోదయ, మధ్యాహ్న, సూర్యాస్తమయ సమయములందును,

పరుండబోవుటకు ముందును, ఆహారము గైకొనుటకు పూర్వమును తురుష్కులును, తదితర మతస్థులును ప్రత్యహా ప్రార్థనలను ఉంచుకొని యున్నారు. యోగమునకు ఆది (ప్రారంభవిషయము) ప్రార్థన. ప్రార్థన యోగమునకు ప్రప్రథమమైన ప్రధానాంగము. ప్రారంభ (ముందుఁ జేయవలసిన) ఆధ్యాత్మిక సాధనాభ్యాసము ప్రార్థన. బందికాడైనను, వాడు ప్రార్థించినపుడు దేవుఁడు వానికి సాహాయ్యము చేయును. భగవంతుని, అంతఃకరణశుద్ధి, భక్తి, జ్యోతిర్జ్ఞానములకొరకు ప్రార్థింపుము. నీకివి సంప్రాప్తమగును. పెందలకడనే ప్రాతఃకాలమున నిద్రలేచి, మానసిక శారీరక బ్రహ్మచర్యమును పడయుటకై కొన్ని ప్రార్థనలను జపింపుము. నీకిష్టమువచ్చిన (ఏదో) తెలుగున ప్రార్థింపుము. పసిపాపను పోలి నిరాడంబరివై, ఆర్జవమతివై యుండుము. నీ హృదయ కవాటములను ధారాళముగఁ దెరచియుంచుము. శ్రద్ధాళువులైన భక్తులు ప్రార్థనల యొక్క ఘనమైన ప్రయోజనమునుగూర్చి స్పష్టముగ కంటికికట్టినట్లుగ తెలియుదురు. నారదమహాముని ఇప్పుడుకూడ, ఇప్పటికిని ప్రార్థన చేయుచున్నాడు. నామదేవుఁడు ఆరాధించినపుడు అతని అన్నమును ఆరగించుటకు విఠ్ఠలస్వామి విగ్రహమునుండి వెలుపడి వచ్చెను. ఏకనాథుఁడు ప్రార్థన గావించినపుడు శ్రీహరిప్రభువు తనదు చతుర్భుజ సురూపమును చూపించెను. దమాజీ అర్చించినపుడు శ్రీకృష్ణుఁడు వానికి భృత్యుడై సేవ యొనరించెను. బాద్షాకు తన బాకీలను చెల్లించువేళ అతఁడు నీచ పాత్రమును వహించెను. నీకికేమి కావలయును? ఇప్పటినుండియే, సాక్షాత్ ఈ క్షణమునుండియే మనఃపూర్వకముగ ప్రార్థన నాచరింపుము. భ్రాతా, ఆలసింపకుము. ఆ "రేపు" ఎప్పటికిని రాబోదు.

ప్రార్థనా ప్రభావము అనిర్దేశ్యము. దాని మహిమ అనిర్వాచ్యము. విశ్వాససంపన్నులైన భక్తులుమాత్రమే దానియొక్క పరమ ప్రయోజనమును, వైభవమును కనుగొందురు. నీవు గౌరవ, విశ్వాస, నిష్కామ్య (ఫలము నెదురుచూడకుండు) భావములతోను, ప్రేమార్ద్రి హృదయముతోను ప్రార్థన సేయవలయును. హే మూఢమతే, ప్రార్థనయొక్క ప్రయోజనమును గురించి వాదులాడకుము. నీవు మోసపోయె

దవు. ఆధ్యాత్మిక విషయములలో వాదించుట (జల్పము) పనికిరాదు. బుద్ధి అనునది ఒకానొక సాంతమైనట్టియు, అబలమైనట్టియు ఆయుధము. దీనిని నెఱనమ్మకుము. ప్రార్థనా జ్యోతి సాహాయ్యమున నీ యజ్ఞానమనెడి తిమిరమును తొలగింపుము.

నమామి నారాయణపాదపంకజమ్
కరోమి నారాయణపూజనం సదా।
వదామి నారాయణ నామ నిర్మలమ్
స్మరామి నారాయణతత్త్వమవ్యయమ్॥

ఓం శాంతిః శాంతిః శాంతిః.

ఆంధ్రీకర్తః— రావినూతల రాధాకృష్ణయ్య.

( 13_వ పేజీ తరువాయి. )

యాగయోగములు_జపతపములు_పూజాపురస్కారములు సంగదోషమును నివృత్తము చేయగలవు.

రావణుడు అసమానమైన ప్రజ్ఞ కలవాడు. వేదములను కంఠపాఠము చేసినవాడు. పదితలల తెలివి, యిరవై కన్నుల చూపు కలవాడు. అయినను వాడు రాక్షసుడనబడెను. ఆసక్తితో అభిమానముతో కూడి యుండుటబట్టి బ్రహ్మవంశమున బుట్టియు రాక్షసుడనబడి చివరికి సర్వనాశమొందెను. సకామ భావన_ఫలాసక్తి యెట్టివానినైనను అధోగతి పాలుజేయగలవు.

(సశేషము.)



## ఆంధ్రదేశమున

### అనన్య గీతాప్రచారకులు IV

### శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్యులగు

# శ్రీ శుద్ధచైతన్యస్వాములవారు

(రచన: శ్రీవారి చరణకమలరేణువు-విద్వాన్ S. రాజగుప్త, బెంగళూరు)

ఆత్మానందాయ శుద్ధాయ చైతన్యాయ మహాత్మనే।
నమః శ్రీ శుద్ధచైతన్య గురుపాదాంబుజన్మనే॥

శ్రీమదఖండ సచ్చిదానంద స్వరూపులును, అగణిత శమదమాది సుగుణగణగరిష్ఠులును, అసామాన్యపండిత పరిష్ఠులును, దయాసముద్రులును, ప్రేమస్వరూపులును, అస్మదీయ గురువర్యులును, అనంత శిష్యప్రశిష్యకోటి యుతులును, గీతాభాష్యానువాదేత్యాది బహుగ్రంథ కర్తలును, వ్యాఖ్యాకర్తలును, త్యాగమూర్తులును నగు శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్యులు శ్రీ శ్రీ శ్రీ శుద్ధ చైతన్యస్వాములవారి పవిత్ర జీవనమందలి కొన్ని ముఖ్యాంశములను సంగ్రహముగా గీతావాణి పాఠకులకు తెలియబఱచుచు శ్రీవారి పరిచయము చేయించుటద్వారా ధన్యత నొంద గోరినాడను.



## జన్మాదికము

శ్రీవారు గుంటూరుజిల్లా నరసారావుపేట తాలూకా సంతగుడిపాడు అను గ్రామమున సుపవిత్ర వైశ్యకులంబున నుదయించిరి. వీరే జ్యేష్ఠ కుమారులు. ఇద్దరు తమ్ములు ఒక సోదరీమణియును ప్రస్తుతము నరసారావుపేటలోనే ఆదర్శ పవిత్రజీవనము గడపుచున్నారు. వీరి పూర్వనామము శ్రీ చిలకల వేంకటేశ్వరరావుగారు. మల్లెపూవు మొగ్గగానున్నను దాని సువాసన తగ్గనట్లు వీరి బాల్యముననే భక్తి, శాంతి, దయ, ఆధ్యాత్మిక సంస్కారము మున్నగునవి సహజముగా నలవడెను. "పూర్వాభ్యాసేన తేనైవ" అన్నట్లు ఎవరును చెప్పకయే రోజును ఉదయం లేవగానే ప్రక్కనున్న ఒక గుడిలో కూర్చుండి దేవునియెదుట ధ్యానము జపము ప్రార్థన చేయుచుండెడివారు. సర్వసల్లక్షణములు కలిగియుండెడివారు.

## విద్యాభ్యాసము - తపస్సు

బాల్యమున కొంతవఱకు బడిచదువు బడసినను గుంటూరులో స్థాపింపబడిన శ్రీ వైశ్య గురుకులాశ్రమమున ప్రవేశించి ఉప

నయనముచే సంస్కరింపబడిరి. సంస్కృతం వేదం ప్రయోగభాగం జ్యోతిషము మున్నగువానియందు అసామాన్య పాండిత్యమును గడించిరి. దేవాలయ ప్రతిష్ఠాసంబంధమైన వివిధాగమ శాస్త్రగ్రంథములను తెప్పించి స్వయముగాపఠించి సక్రమముగా దాని ప్రయోగమును స్వయముగా వ్రాసిరి. మంత్రశాస్త్రములను చక్కగాపరిశీలించిరి. గీత మున్నగు సర్వవేదాంత గ్రంథములను అధ్యయనమొనర్చిరి. ముఖ్యముగా నిత్య కర్మానుష్ఠానము, ఆత్మధ్యానము విడువక చేయుచుండిరి. వీరి సద్గుణములు సదాచారము ఆత్మనిష్ఠ సర్వులకు ముదమొదవించెను. సజ్జనుల, పెద్దలదృష్టిని చూరగొనెను. ఇట్లుండ బాపట్లలోనుంటున్న శ్రీశ్రీశ్రీ పరమహంస ఆత్మానందసరస్వతీ స్వాములవారు అప్పుడప్పుడు ఈ గురుకులాశ్రమ విద్యార్థులను చూచుచు అందరికీ హితోపదేశమొనర్చు సమయమున వీరి అసామాన్య బుద్ధిశక్తి బ్రహ్మనిష్ఠాగరిష్ఠత మున్నగువానినిచూచి పులకితులై "లోకోద్ధారకుడగు ఒక మహాత్ముడగుట తథ్య"మని ్రయించి వారికి మంత్రోపదేశమును, జ్ఞానోపదేశమును కూడ గావించిరి. అప్పటి నుండి వీరియందు ఆత్మజ్ఞానము మిక్కిలిగా వెల్గొందసాగెను. మంత్రానుష్ఠానము తీవ్రమయ్యెను. శ్రీ వ్యాసాశ్రమము మున్నగు పవిత్రస్థలములలో కొంతకాలముండి కఠిన తపంబొనర్చిరి. అనేక సిద్ధులంబడసిరి. ఉపాస్యమూర్తియైన శేషశాయిని అనేక పర్యాయములు స్వప్నాదులలో దర్శించి స్పర్శించి హర్షించిన మహనీయులు,

## శిష్యసంచయము

విద్యాపిపాసచే నేను శ్రీ నారాయణమూర్తి మరికొందరును శ్రీసింహపురీ పీఠాధిపతులవెంట నిజాం ప్రాంతమున సంచరించుచుండ మాకు వేదసంస్కృత విద్యాబోధనకై శ్రీవారు గుంటూరు నుండి 10-1-1938 తేదిన పిలిపింపబడిరి. అప్పటి నుండియే శ్రీవారి దర్శన స్పర్శన సేవాభాగ్యము మాకులభించెను. తగిన సద్గురువర్యునికొఱకై పరితపించుచున్న మాకు వీరు ఈ విద్యలకే కాక ఆధ్యాత్మవిద్యకునుగురువై 16-4-1938 వ తేదిని మంత్రోపదేశ గురువులై వెల్గొందిరి. ఆ పీఠాధిపతుల వెంట కేవలం 3-4 మాసములుమాత్రమేయుండి మా ముగ్గురితో 15-5-1938 వ తేదిని కృష్ణాజిల్లా గుడివాడకు విచ్చేసిరి. అచ్చట కన్నతండ్రివలె పోషకులై నిలబడిన త్యాగమూర్తులగు శ్రీ పిన్నంశెట్టి వెంకయ్యగారి యుదారసహాయముతో 19-5-1938 వ తేదిని ఒక "వేదసంస్కృతపాఠశాల"ను స్థాపింపజేసిరి. దాదాపు రెండు సంవత్సరముల కాలము శ్రీవారు మాకు వేదం, ప్రయోగభాగం, సంస్కృతం, హిందీ, తెలుగేగాక గీతాభాష్యము, ఉపనిషద్భాష్యము, విష్ణుసహస్రనామ స్తోత్రభాష్యము, తులసీ రామాయణము, భాగవతం, పంచదశి మున్నగుగ్రంథములను నియమముగా బోధించుచువచ్చిరి. ముఖ్యముగా మంత్రానుష్ఠానము, ధ్యానము, గీతాపారాయణ, గీతాప్రవచనములు చాల నియమబద్ధముగా కొంతకాలము అవకా

హారవ్రతముతోను జరిపించుటచే మా జీవితమున నీ కాలమును ఒక సువర్ణయుగముగా గావించిరని చెప్పకతప్పదు.

## సంన్యాసస్వీకారము-గ్రంథరచన

ఈ రోజులలోనే (1938వ సంవత్సరముననే) గుంటూరులో నొకచోట వేదాంతోపన్యాసముల నిచ్చుటకై వెళ్ళి ఉపన్యసించుచు పరిపూర్ణ వైరాగ్యమును పొందినవారైరి. "యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్" అనెడి శ్రుతివాక్యము లోపల నుండి కూయిడుచు గలిగిన వైరాగ్యమును దృఢపఱచెను. బీజరూపముగా లోపల దాగియున్న సత్యసంన్యాసము శుద్ధపరిపూర్ణ సంస్కారముచే ప్రకటితమై అనుభవరూపమయ్యెను. నైష్ఠిక బ్రహ్మచర్యమునుండియే సర్వసంగ పరిత్యాగమొనర్చి జ్ఞానసంన్యాసముం గైకొనిరి. బాహ్యచిహ్నమైన పవిత్ర కాషాయవస్త్రములచే స్థూలదేహమునలంకరింపఁజేసిరి. సర్వసంగపరిత్యక్తులైనను నడువీధిలో మమ్ములవీడక మాకు ఒక జ్ఞానదృష్టిననుగ్రహించి కృతార్థులొనర్చి సత్సంసర్గమావశ్యకమని తలంచి నన్ను శ్రీ రమణాశ్రమమునకును శ్రీ నారాయణమూర్తిని శ్రీ వ్యాసాశ్రమమునకు నంపి తాము స్వేచ్ఛగా బ్రహ్మజ్ఞానారణ్య విహారులైరి. మరియు సంన్యాసమును స్వీకరించినవెంటనే 'గేయం గీతా నామసహస్రం' అన్నట్లు గుడివాడలోనే గీతా-శంకరభాష్యమును విష్ణుసహస్రనామస్తోత్ర శంకరభాష్యమును తెలుగు భాషను అనువాదమొనర్చిరి. నారాయణోపనిషత్తు, సిద్ధగీత - బ్రహ్మజ్ఞానావలీమాల, ప్రశ్నోత్తరీమణిరత్నమాల (శంకరకృతము) నారద భక్తిసూత్రములు, స్వస్వరూపదర్పణము అను గ్రంథములకు తెనుగు తాత్పర్యమును రచించిరి. శ్రీ ఆదిశంకరుల వేదాంతడిండిమమునకు అపూర్వమగు విపులవ్యాఖ్యానమును వ్రాసిరి. గీతా ప్రెస్సువారి బ్రహ్మచర్యముననువదించిరి. ఉపనిషదాదుల నుండి 148 ఉత్తమవాక్యముల నేర్చికూర్చి వానికి తాత్పర్యమును వ్రాసి "ముక్తిగీత" యను సార్థకనామమునిడిరి. అంతకంటె గొప్పగా శ్రీ విద్యారణ్య స్వాములవారి గురువైన శ్రీ శంకరానంద యతివరేణ్యుల విపులమైన అద్భుతమైన గీతావ్యాఖ్యానమును తెలుగులో చక్కని అనువాదమొనర్చి ఆంధ్రభాషామతల్లికిగల కొఱంతను నివారించిరి. గీతామాహాత్మ్యమునకు ఇంతవఱకు నెవ్వరును రచింపని విపులమైన వ్యాఖ్యానమును రచించి ఈ గ్రంథమున పొందుపఱచియుండుట ఒక గొప్పవిశేషము. అనేక ఉదారులసహాయముచే ఈ మధ్యనే ప్రకటింపబడిన (శ్రీ రామతీర్థుల పట్టశిష్యులగు శ్రీ నారాయణస్వామి M. A. గారి) 'గీతా దర్శనము' శ్రీవారిచేతనే సంస్కరింపబడియె. పెక్కు మాసములుగా మన గీతావాణిలో ప్రకటింపబడుచున్న గీతా-శంకర భాష్యానువాదము తప్ప తక్కిన పై గ్రంథములన్నియు త్యాగులు, ఆస్తికులు, ధర్మాసక్తులునగు పెక్కండ్ర సహాయముచే ముద్రింపబడి ప్రకటితములైనవి. చివరిదిగా శ్రీ లక్ష్మ్యష్టోత్తరశతనామ స్తోత్రమునకు చక్కని వ్యాఖ్యానమునురచించి స్తోత్రము, నామావళి, వ్యాఖ్యానము శ్రీ చక్రముతో

కూడ ప్రకటించిరి. శ్రీవారి ఈ అమూల్య గ్రంథములన్నియు "చైతన్య గ్రంథ మండలి, 135 వీరపిళ్ళైవీధి, బెంగ ళూరు – 1" అను చోట లభించును. పూజ్యపాద శ్రీ కేశవతీర్థస్వాములవారి "రామదర్శన్" పత్రికలో శ్రీ వారి "ఔపనిషదసూక్తు"లను భక్తితో మననము చేసినవారికి భుక్తియు ముక్తియు తప్పవు.

బందరు శ్రీ ఆ. ల న. సోమయాజీ వైశ్య సమాజమువారు ప్రకటింపబూనియున్న, పండితరాయ మామిడి వేంకటార్యులవారిచే రచింపబడిన కొంతవరకు శిథిలమైయున్నం దున కొన్నిలోపదోషములతో కూడియున్న "శబ్దార్థకల్పతరువు" అనెడి సంస్కృతం – సంస్కృతం – తెలుగు నిఘంటువును దాదాపు నాలుగు సంవత్సరములుగా తక్కిన పెక్కు నిఘంటువుల సహాయముతో బందరు, గుడివాడ, చివరకు బెంగళూరులో కొంతకొంతకాలముండి ఆంధ్రులకు ఆంధ్రేతరులకు అందరికీ ఉపయోగమగు నట్లు నూతనవిధానముతో చక్కగా సంస్కరించిరి. దానిని మొత్తము క్రొత్తగా శుభ్రముగా వ్రాసిరి. ఈ గ్రంథముయొక్క సంస్కారమహాసేవలో కొంతవరకు నాకును, చాలవరకు శ్రీ నారాయణమూర్తిగారికిని అవకాశమును గల్గించి ధన్యులగావించిరి. త్వరలో వెలువడనున్నది. మరియు బాపట్ల, వినుకొండ గ్రామములలో దేవాలయ ప్రతిష్ఠల గావించి తమ ఆగమశాస్త్రప్రావీణ్యతను సార్థకపఱచుకొనిరి. అనుభూతి పంచకము, అద్వైతఆర్యాపంచకము, స్వస్వరూపదర్పణము, శ్రీ శైలేశస్తోత్రము మున్నగువానిని సంస్కృతమున రచించిన పండితోత్తములు, కవులు, జ్ఞాననిధులు, శ్రీవారి అపారమైనదయనుగూర్చి చెప్పుటకలవిగాని సంఘటనలు నిత్యము గాంచవచ్చును. అఖండచిద్రూపమైన బ్రహ్మస్వరూపమును గూర్చి తత్త్వమసీత్యాది మహావాక్యముల తో చక్కగా ప్రతిపాదించి శ్రోతలనానంద సాగరమున ముంచివేసినను భక్తిలేనిజ్ఞానము శుష్కమని నిశ్చయించి ముఖ్యముగా సగుణోపాసన ఆవశ్యకమని బోధించుచు భక్తిలక్షణముల ప్రతిపాదించుచుండ రోమాంచాశ్రుపులకములనందని కఠినాత్ములుండరేమో! శ్రీవారి గీతాప్రవచనము భాష్యానుసారముగాను శ్రోత్రఘక్కితో కూడి జిజ్ఞాసువుల సందేహముల దగ్ధమొనర్పగల దిట్టతనముతో నొప్పినది. పెక్కుచోట్ల పెక్కుమందిభక్తులు శ్రీవారికొఱకు ఆశ్రమముల కట్టించియిచ్చినను, కట్టింతమన్నను, "అనికేతః స్థిరమతిః" అనెడి భగవంతుని గీతావాక్యమును కార్యరూపమును చేయు దలంచిన ధీరులుగాన ఎచ్చటను శాశ్వతముగానుండక ఒక్కొకచోటను కొన్ని రోజులు, వారములు, పక్షములు, లేదా పెద్దకార్యమైనచో కొన్నిమాసములు మాత్రముండుచు గీతాదిప్రచారమును గావించుచు స్థితప్రజ్ఞులై వెల్గొందుచున్న పరివ్రాజకోత్తములు. శ్రీశంకరజయంతీ మహోత్సవములో పాల్గొనుటకై నాలుగేండ్లక్రిందట అళ్ళగడ్డ శ్రీ శంకరానందాశ్రమమునకు వెళ్ళినప్పుడు అచ్చటి సంస్కృతపాఠశాలకధ్యాపకులుగా న్యాయవేదాంత శిరోమణులగు శ్రీ నారాయణమూర్తి గారిని పంపినవారు శ్రీవారే.

అఖండాద్వైతీయ జ్ఞానసంపన్నులైనను సర్వభూతహితేరతులు గాన నిరంతరము తమ భక్తసంతానముయొక్క శ్రేయస్సుకొఱకై నామజపము ధ్యాన ప్రార్థనలు విడువని నిష్ఠాగరిష్ఠులు. ఇట్టి మహిమాన్వితులగు గుణాతీతుల గుణగణములంగూర్చి గుణాన్వితమగు ఈ బుద్ధి వర్ణింప శక్యము కాదుగదా! కాని విషయవిస్తరభీతిచే తెలిసినంతవరకు సంగ్రహముగా తెలిపితిని. మరికొన్ని వివరములు సమయమునకందలేదు. ఇందలి సమ్మత విషయములు గ్రాహ్యములు సాధకులకు ఆదర్శప్రాయములగుగాక. అసమ్మతివిషయములు ఏవేనియున్నచో నాబుద్ధిదోషమని త్యాజ్యములు. ఇట్టి అనన్యగీతాప్రచారకుల దర్శించి వారి దివ్యములైన జ్ఞానామృతధారలనుగ్రోలి ధన్యులు కాగలరని యాశించుచున్నాను.

మంగళం గురుదేవాయ శుద్ధచైతన్యరూపిణే ।
హృదంధకారరవయే సచ్చిదానందరూపిణే ॥

శ్రీ సద్గురు చరణారవిందార్పణమస్తు.
హరిః ఓమ్ తత్ సత్

# వార్తలు.

19—10—54 వరకు చిత్తూరు జీవకారుణ్య అన్నదానసమాజమునందు శ్రీ శంకరానందస్వాములవారు ఉపనిషద్-గీతోపన్యాస కార్యక్రమమునొనర్చి 20-వ తేదీ ఉదయమే కోలారుజిల్లా ముళబాగలు చేరుకొన్నారు. అచ్చట 5 రోజులు యిరుపూటలును శ్రీ బాలకృష్ణాశ్రమమునందు శ్రీవారు భగవద్గీత నాల్గవ అధ్యాయము జ్ఞానయోగమునుగూర్చి ఉపన్యసించినారు. శ్రీ రామకృష్ణగారి అనువాదము జరిగినది.

అక్టోబరు నెల 25, 26, 27 తేదీలు పలమనేరు తా॥ బైరెడ్డిపల్లె యందును, 29, 30, 31, తేదీలు అనంతపురం జిల్లా బెళగుప్ప గ్రామంలో ఉపన్యాస కార్యక్రమములు జరిపి శ్రీ శంకరానందస్వాములవారు శ్రీ రామకృష్ణగారితోసహా నవంబరు 1-వ తేదీకి కర్నూలుజిల్లా కోయిలకుంట్ల తాలూకా గుళ్ళదుర్తి శ్రీ సీతారామాశ్రమము చేరుకొన్నారు. 7-11-54 వరకు అచ్చటవుండినారు. అచ్చటినుండి శ్రీ రామకృష్ణగారు గండిక్షేత్రము వెళ్ళినారు. శ్రీవారు చాగలమఱ్ఱివెళ్ళి శ్రీశివరామానందాశ్రమమున 3 రోజులుండి తర్వాత ఆళ్ళగడ్డ శ్రీ శంకరానందాశ్రమము చేరుకొన్నారు.

కార్తీక పూర్ణిమ 10-11-54 ఆరంభించి పదిరోజులు ఆళ్లగడ్డ శ్రీ శంకరానందాశ్రమమునందు యిరుపూటలును శ్రీ స్వామివారి ఉపన్యాసములు జరిగినవి. తర్వాత 23-11-54 తేదీకి శ్రీవారు నంద్యాల చేరెదరు. శ్రీ రామకృష్ణగారు గండినుండి నంద్యాలరాగలరు. శ్రీమతి పగిడి శాయమ్మగారి మేడపై ఉపన్యాసములు జరుగగలవు.



# శ్రీభగవద్గీత
# శ్రీరామానుజ భాష్యానువాదము

శ్రీ. కిళాత్తూరు - శ్రీనివాసాచార్యులు.

(1954 జనవరి నెల సంచిక 31_వ పేజి తరువాయి.)



భాష్యం :_ ప్రథమం తావత్ ఆత్మనాం స్వభావం శృణు —

అను: (అవతారిక)— మొట్టమొదట ఆత్మలయొక్క స్వభావమునుగురించి వినుము.

శ్లో॥ న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః ।
న చైవ న భవిష్యామః సర్వే వయ మతఃపరమ్॥ 2 అ. 12

భా: అహం = సర్వేశ్వరస్తావత్, అతః వర్తమానాత్ పూర్వస్మిన్ కాలే, న నాసమ్ అపిత్వాసమ్। త్వన్ముఖాశ్చైతే ఈశితవ్యాః క్షేత్రజ్ఞాః న నాసన్ అపి తు ఆసన్। అహం చ యూయం చ = సర్వే - వయం, అతఃపరం = అస్మాదనన్తరే కాలే, న చైవ న భవిష్యామః, అపితు భవిష్యామ ఏవ॥

యథా అహం సర్వేశ్వరః పరమాత్మా నిత్యః ఇతి న అత్ర సంశయః, తథైవ భవన్తః క్షేత్రజ్ఞాః ఆత్మానోఽపి నిత్యా ఏవేతి మన్తవ్యాః. ఏవం భగవతః సర్వేశ్వరాత్ ఆత్మనాం - పరస్పరం చ భేదః పారమార్థిక ఇతి భగవతైవోక్తమితి ప్రతీయతే; అజ్ఞాన మోహితం ప్రతి తన్నివృత్తయే పారమార్థిక నిత్యత్వోపదేశ సమయే అహం త్వం ఇమే సర్వే వయమితి వ్యపదేశాత్॥

అను: సర్వేశ్వరుడనైన నేను ఈవర్తమానకాలముకంటే పూర్వకాలమున లేనను నది లేదు. మఱివుండియే యుంటిని. నీవు మొదలైన రక్ష్యులు— క్షేత్రజ్ఞులు-లేరనునది లేదు. అనగా వుండియేవున్నారు. నేనున్ను, మీరున్ను మనమందరమున్ను ఇప్పటికంటే తరువాత (రాబోవు) కాలములో లేకబోవుట లేనేలేదు. మఱి తప్పక వుండబోవుచున్నాము.

ఎట్లయితే సర్వేశ్వరుడనైన పరమాత్ముడనై యున్న నేను నిత్యుడనను విషయమున సంశయములేదో, అట్లే క్షేత్రజ్ఞులగు ఆత్మలైన మీరుకూడా నిత్యులనియే తెలియవలెను. అజ్ఞానముతో మోహిం

చినవానినిగూర్చి, ఆ మోహానివృత్తికై పారమార్థికమైన నిత్యత్వము నుపదేశించు సందర్భమున "నేను నీవు వీరు మనమందరు" అని వ్యవహరించినందున, భగవంతుడగు సర్వేశ్వరునికిని-ఆత్మలకును పరస్పరము భేదము వాస్తవికమైనదని భగవంతునిచేతనే చెప్పబడినదని స్పష్టమగుచున్నది.

విశేషార్థము:— "అహం". భగవంతుడు ప్రయోగించిన యీ "అహం" శబ్దము; అతను సర్వనియంతయను విషయమును చాటుచున్నది. పరమాత్మా = దేశకాలానవచ్ఛిన్నవ్యాప్తిః. ఎవనివ్యాపిత్వము ఒక దేశముతోకాని, కాలముతోకాని కూడుకొన్నదికాదో అనగా సర్వకాలసర్వదేశములందున్నట్టిదో, అతడే పరమాత్మయనబడును.

ఇచ్చట కొందరి ఆక్షేపమేమన, ప్రత్యక్షముగా కనబడుచున్న శరీరమే తానని భావించువాడు, దేహానికంటే వేఱుగా నొక జీవాత్మ వున్నదనే విషయములోనే సంశయముకల్గియున్నప్పుడు — ఆ దేహానికంటెను జీవాత్మకంటెను వేఱుగా — బొత్తుగా గోచరంకానట్టి పరమాత్మ వస్తువొకటి కలదను విషయంలో ఎట్లు సందేహము లేకయుండును?

ఇందులకు సమాధానమేమన:— పరమాత్మసత్తావిషయమున సాధారణవ్యక్తికి అట్టి సంశయముకలుగవచ్చునేమో కాని, అర్జునునికి మాత్రం అలాటి సంశయముకల్గుటకు అవకాశములేదు. ఎందుకన భగవంతునిగూర్చి "పురుషం శాశ్వతందివ్యం" అని పల్కువాడును, నారద - అసిత - దేవల - వ్యాసాది మహర్షుల యుపదేశములవలన పరమపురుష స్వభావపరిజ్ఞానముకలవాడును, స్వర్గలోకమును సకల మంత్రప్రభావమును తపఃప్రభావమును సాక్షాత్కారము చేసికొన్నవాడును, అత్యధిక దేవతాగురుభక్తికలవాడును, వర్ణాశ్రమధర్మముల చక్కగా పరిపాలించువాడును, ధర్మలోపభయ వ్యాకులుడునగు అర్జునుడు, దేహాతిరిక్తమైన జీవాత్మవిషయములోకాని, ఆ రెంటికతీతమైన పరమాత్మవిషయములోకాని, ఏమాత్రం సంశయింపడు. అయితే అతడు శోకించుటకు కారణమేమన, అతను సామాన్యముగా జీవాత్మయొకటియున్నదనియు, పరమాత్ముడొకడున్నాడనియు ఎఱుగును

కాని ఆ జీవాత్మపరమాత్మల స్వరూపస్వభావముల బాగుగానెఱుగడు. కనుకనే అతనికట్టి శోకమోహాదులు కల్గుటకు కారణమని తెలియ వలెను.

మఱియు పరమాత్మకు — జీవాత్మలకు, అట్లే జీవాత్మలలోకూడ ఒక జీవాత్మతో మరియొక జీవాత్మకు పరస్పరము భేదమున్నదని భగవంతుడే (ఎవడో బాటసారి కాదు) చెప్పినందున అట్టిభేదము పారమార్థికమేనని సిద్ధించుచున్నది. అట్లుగాక, ఆత్మలకు పరస్పరభేదము లేదన్నచో బద్ధుడు - ముక్తుడు, శిష్యుడు - ఆచార్యుడు మొదలగు వ్యవస్థయే లేకపోవును. కనుక వ్యవహారములోనున్న యీ వ్యవస్థను కుదుర్చుటకై తప్పక ఆత్మస్వరూపములకు పరస్పరభేదమంగీకరించియే తీరవలెనని భావము.

భా: ఔపాధిక - ఆత్మభేదవాదే హి ఆత్మభేదస్య అతాత్త్వికత్వేన తత్త్వోపదేశసమయే భేదనిర్దేశో న సంగచ్ఛతే। భగవదుక్తాఽఽత్మభేదః స్వాభావిక ఇతి శ్రుతిరప్యాహ:- "నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానాం ఏకో బహూనాం యో విదధాతి కామాన్" ఇతి. నిత్యానాం బహూనాం చేతనానాం యః ఏకః నిత్యః చేతనః, సః కామాన్ విదధాతి ఇత్యర్థః॥

అను: ఆత్మభేదము ఔపాధికమని వాదించు (భాస్కర) మతమున, ఆత్మభేదము అవాస్తవికమగుటంబట్టి, తత్త్వము నుపదేశించు సమయమున (నేను, నీవు, వీరు అని) భేదమును నిర్దేశించుట పొసగదు.

భగవంతుడు పల్కిన ఆత్మభేదము స్వాభావికమైన దని శ్రుతి గూడ జెప్పుచున్నది:—నిత్యములగు అనేక ఆత్మలకు, ఒక నిత్యచేతనుడు (పరమాత్మ) కోర్కెలను నెరవేర్చుచున్నాడు అని అర్థము.

విశే: శరీరాంతఃకరణాద్యుపాధులభేదము సత్యమైనదనియు, సర్వత్ర వ్యాపించియున్న బ్రహ్మమునకు (ఆయుపాధిభేదమువలని) భేదము అవాస్తవికమైనదనియు భాస్కర సిద్ధాంతము. అట్లయిన ఆత్మైకత్వమును బోధించవలసిన యీ తత్త్వోపదేశ సందర్భమున "నీవు, నేను, వారు" అని ఆత్మభేదము నుపదేశించుట అసంగతమని భావము.

(సశేషము.)

# గీతావాణి - పోషక వర్గము.

## మహారాజ పోషకులు రు. 108

కర్నూల్ జిల్లా: 1. శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర శ్రీశివాచార్యస్వాములవారు - 2. మాతృశ్రీ చిన్నమ్మగారు, శ్రీసీతారామాశ్రమం, గుళ్లదూర్తి, కోయిలకుంట్ల తా॥ - 3. శ్రీ సి. పి. తిమ్మారెడ్డిగారు, నాగిరెడ్డిపల్లె, శిరివెళ్ల తాలూకా. - 4. స్వర్గీయ సేగు సుబ్బన్న శ్రేష్ఠిగారి ధర్మపత్ని శ్రీ లక్ష్మమ్మగారు, నంద్యాల. - 5. శ్రీ వంకదార సుబ్బయ్యగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తాలూకా. - 6. శ్రీ పగిడేల లక్ష్మీనారాయణరెడ్డిగారు, దొర్నిపాడు, కోయిలకుంట్ల తా॥ - 7. శ్రీ తొమ్మండ్ర రామసుబ్బయ్య శ్రేష్ఠిగారు, చాగలమర్రి. - 8. శ్రీఉప్పలపాటి నారాయణరెడ్డిగారు, వై. కృష్ణాపురము, శిరివెళ్ళ తాలూకా. - 9. శ్రీ ఇ. బి. బాలసుబ్బయ్యగారు, ఆళ్లగడ్డ. - 10. శ్రీ జి. వీరారెడ్డిగారు, వి.ఎం. ఎర్రగుడిదిన్నె, ఎర్రగుంట్లపోస్టు.-11. శ్రీమతి పగిడి శాయమ్మగారు, నంద్యాల. - 12. శ్రీబొల్లుపల్లి చిన్నఓబయ్యగారు, పడకండ్ల, ఆళ్లగడ్డ, P.O.

కడపజిల్లా: 13. శ్రీహిమకుంతల ఈశ్వరనారాయణరావుగారు, రామిరెడ్డిపల్లె, పాలగిరి పోస్టు. - 14. శ్రీ బచ్చు బంగారు మునెయ్య శ్రేష్ఠిగారు, ఎర్రగుంట్ల ఆర్. ఎస్. 15. శ్రీపోలేపల్లె రాజా వెంగన్న శ్రేష్ఠిగారు, వల్లూరు.

చిత్తూరు జిల్లా: 16. శ్రీ మదళ్ళపల్లి మునిసుబ్రహ్మణ్యం శ్రేష్ఠిగారు, బజార్ వీధి, చిత్తూరు. - 17. శ్రీ యస్. రామలింగంపిళ్లెగారు, జవిళివ్యాపారం, చిత్తూరు.

అనంతపురం జిల్లా: 18. పూజ్యపాద శ్రీ చిద్గగనానంద మహర్షులవారు, శ్రీ భవనాశి ఆశ్రమం. - 19. శ్రీపోసిన వెంకటరెడ్డిగారు, రాగలపాడు.- 20. పి. నరసింహశాస్త్రిగారు, తాలూకా హెడ్ అకౌంటెంటు, కల్యాణదుర్గం.

నెల్లూరుజిల్లా: 21. శ్రీ వాకాటి సంజీవశెట్టిగారు, పత్తేఖాన్ పేట, నెల్లూరు. 22. శ్రీ వేమారెడ్డి బలరామరెడ్డిగారి ధర్మపత్ని యశోదమ్మగారు, ఇనమడుగు.

గుంటూరు జిల్లా: 23. శ్రీ శ్రద్ధానందస్వాములవారు, శ్రీ బ్రహ్మానందాశ్రమము, పెరవలిపోస్టు, (తెనాలి)

ఉత్తర ఆర్కాడుజిల్లా: 24. శ్రీ ఆర్.పి. రామనాథంరెడ్డిగారు, కాటుకానూరు, కణ్ణమంగళం పోస్టు.

మైసూరుస్టేట్: 25. శ్రీ పెండుకూరి గోవిందప్ప అండ్ సన్స్, హాస్పేట్, బళ్లారిజిల్లా. - 26. శ్రీ పత్తికొండ సుబ్రహ్మణ్యప్ప శ్రేష్ఠిగారి ధర్మపత్ని సౌభాగ్యవతి లక్ష్మిబాయమ్మగారు, హాస్పేట్ - 27. శ్రీ గంగావతి భీమప్ప శ్రేష్ఠిగారు, నారాయణదేవరకెరె. - 28. శ్రీ ఎం. వి. రామలింగయ్య శ్రేష్ఠిగారు, బంగారుపేట, కోలారుజిల్లా.- 29. శ్రీ జి. ఎన్. శంకరనారాయణ బ్రదర్స్, మండీ మర్చంట్స్, బెంగుళూరు సిటి.

నైజాం స్టేట్: 30. శ్రీ డి. పి. సదాశివరాజులుగారు, ఆనెగొంది. — 31. శ్రీ పడిశాల భద్రయ్యగారు, వరంగల్ — 32. శ్రీసాధు పాపయ్యగారు, బ్రహ్మవిద్యాశ్రమం కేశవపట్నం, కరీంనగర్ జిల్లా.

33 గ్రంథే వరసయ్యశ్రేష్ఠిగారు, నెం. 158 అణ్ణాపిళ్లెవీధి, మద్రాసు.

తూర్పుగోదావరి జిల్లా:— 34. శ్రీ సముద్రమంత్రుల నాగేశ్వరరావుగారు, ర్యాలి.

పశ్చిమ గోదావరి జిల్లా:— 35. శ్రీరాజులపాటి వేంకటేశ్వరులుగారు, పాలకొల్లు. 36. స్వర్గీయ శ్రీమతి అద్దేపల్లి శేషరత్నమ్మగారి స్మారకముగ — భర్త శ్రీ సత్యనారాయణమూర్తిగారు, పాలకొల్లు.

కృష్ణాజిల్లా:— 37. శ్రీధూర్జటి సుబ్రహ్మణ్యంగారు, బందరు. — 38. శ్రీభట్టిప్రోలు సత్యనారాయణరావుగారు. సర్కిల్ పేట, బందరు.

## రాజపోషకులు రు. 54

కర్నూలు జిల్లా: 1. స్వర్గీయ శ్రీబృందాదేవిగారి స్మారకముగ శ్రీ N. అయ్యపురాజుగారు, గోసపాడు. — 2. శ్రీ అమరావతి గోవిందప్పగారు, నొస్సం. — 3. శ్రీ చాటకొండు ఓబులేశ్వరం శ్రేష్ఠిగారు, ఆళ్లగడ్డ. — 4. శ్రీ జె. ఆర్. ఆంజనేయులుగారు, ఆళ్లగడ్డ. — 5. శ్రీ సోముల పెద్దసుబ్బారెడ్డిగారు, ఆళ్లగడ్డ. — 6. శ్రీ బైసాని రామదాసుగారు, ఆళ్లగడ్డ. — 7. శ్రీ డాక్టరు పి. పుల్లారెడ్డిగారు, ఆళ్లగడ్డ. — 8. శ్రీ లక్కిరెడ్డి హనుమంతురెడ్డిగారు, బ్రాహ్మణపల్లె, శిరివెళ్ల తాలూకా. — 9. శ్రీ N. రామిరెడ్డిగారు, డబ్ల్యు. కొత్తపల్లె, కోయిలకుంట్ల తాలూకా. — 10. శ్రీ మదళ్లపల్లె రామసుబ్బయ్యగారు, చాగలమర్రి. — 11. శ్రీ జూటూరు చెంచుసుబ్బయ్యశ్రేష్ఠి & గరుడయ్యశ్రేష్ఠిగారలు, చాగలమర్రి. — 12. శ్రీమతి ఆర్. సుబ్బరత్నమ్మగారు, నంద్యాల. — 13. శ్రీ పాణ్యాం రామచంద్రయ్యగారు, వకీలు, నంద్యాల. — 14. శ్రీ పాణ్యాం రామనాథశాస్త్రిగారు, — కోయిలకుంట్ల. — 15. శ్రీ టి. సుబ్బయ్యగారు, జనరల్ మర్చంట్, పాణ్యాం — 16 శ్రీ శాగం చిన్నకొండారెడ్డిగారు, పేరూరుగ్రామం, యర్రగుంట్ల పోస్టు — 17 జి. సి. బాలన్నగారు, రిటైర్డ్ తహసీల్దారు, ఆళ్లగడ్డ.

కడపజిల్లా. 18. శ్రీ పెద్దిరెడ్డి నారాయణరెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తా॥ 19. — శ్రీ ఎన్. వీరయ్యగారు, శ్రీ ఎం. ఓబయ్య & కంపెనివారు, ప్రొద్దటూరు. — 20. శ్రీ మిట్టా నారాయణశ్రేష్ఠిగారు, పెద్దజూటూరు. — 21. శ్రీ పెంటంశెట్టి శ్రీనివాసశ్రేష్ఠిగారు, వేంపల్లి. — 22. శ్రీ తల్లం గురుమూర్తిగారి కుమారుడు వెంకటయ్యశ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు. — 23. శ్రీ ముమ్మడి పెద్ద సుబ్బారెడ్డిగారు, పాలూరు, జమ్మలమడుగు తాలూకా.

చిత్తూరు జిల్లా: 24. శ్రీ కె. వెంకటరామారెడ్డిగారు, కొత్తకోట. — 25. శ్రీబల్లా తెప్పలనాయుడుగారు, ముత్తరపల్లె. — 26. శ్రీ పి. చిన్నమరెడ్డిగారు, ఎం. ఎల్. ఎ. పెరియంబాడి. — 27. శ్రీ నటుకల రామనాథంశ్రేష్ఠిగారు, చిత్తూరు.

అనంతపురం జిల్లా: 28. శ్రీమతి మంచికంటి సాకమ్మగారు, తాడిపత్రి. — 29. శ్రీ బుస్సెట్టి వన్నప్పగారు, ఉరవకొండ. — 30. శ్రీ కాలువ వెంకటరెడ్డిగారు

రాగలపాడు. - 31. శ్రీమతి పోసిన అచ్చమ్మగారు, రాగలపాడు. - 32. శ్రీ కె. చౌడయ్యాగారు, జమీందార్, మిణకనగుర్కి. - 33. శ్రీ గుంతపల్లి లక్ష్మయ్యచౌదరిగారు, కుందనగుర్తి, ఆలూరు తా॥ - 34. శ్రీ పటేల్ వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. - 35. శ్రీ కందుకూరు వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. - 36. శ్రీ పాటిల్ తిమ్మారెడ్డిగారు, కుందనగుర్తి. - 37. శ్రీ పెద్దకదిరప్పగారు, కుందనగుర్తి. - 38. శ్రీ చిన్నకదిరప్పగారు, కుందనగుర్తి. - 39. శ్రీ సాధు శివలింగప్పగారు, కుందనగుర్తి. 40- శ్రీ శావాల గోవిందప్పగారు, కుందనగుర్తి - 41. శ్రీ ఉద్యాల వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. - 42. శ్రీ శాకల ఆంజనేయులుగారు, కుందనగుర్తి. - 43. శ్రీ పాటిల్ పెద్దబళిరెడ్డిగారిభార్య శ్రీమతి లక్ష్మమ్మగారు, కుందనగుర్తి. - 44. శ్రీ మ్యాడం అశ్వత్థప్ప అండ్ సన్సు, కంబళిమర్చంట్, కల్యాణదుర్గం. - 45. శ్రీ కాసుల శరభయ్యశ్రేష్ఠిగారు, కల్యాణదుర్గం. - 46. శ్రీ బెల్లంకొండ రామప్పగారి వెంకటరమణప్ప కుమారుడు తిమ్మప్పశ్రేష్ఠిగారు, జనరల్ మర్చంట్, కల్యాణదుర్గం. - 47. శ్రీ గాధంశెట్టి లక్ష్మక్క కుమారుడు సుబ్బరాయుడు, కల్యాణదుర్గం.

నెల్లూరు జిల్లా: 48. శ్రీ బ్రహ్మచారి బి. రాజయ్యగారు, శ్రీదత్తాత్రేయాశ్రమము, కసుపర్తిపాడు.

ఉత్తర ఆర్కాడు జిల్లా: 49. శ్రీ శంకరనాయుడుగారు, కార్యారు.

మైసూర్ స్టేట్: 50. శ్రీ కాకుబాళ అంబణ్ణశ్రేష్ఠి అండ్ సన్స్ వారు, హాస్పేట్ 51. శ్రీ వి. ఆర్. రాజగోపాల్ శ్రేష్ఠిగారు, బంగారుపేట. - 52. శ్రీ కె. ఆర్. సీతారామయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట. - 53. శ్రీ కె. నంజప్పశ్రేష్ఠిగారు, బంగారుపేట. 54. - శ్రీ నారాయణమూర్తిగారు, c/o సూరా విరూపాక్షయ్యగారు, తొండేభావి. కోలారు. - 55. శ్రీమతి కుసుమభాగ్యలక్ష్మమ్మగారు, కంటోన్మెంట్, బెంగుళూర్.

హైదరాబాదు స్టేట్: 56. శ్రీ పి. వి. రంగారావుగారు, వకీలు, నల్గొండ. - 57. శ్రీ దేశముఖ్ వేనేపల్లి కొండలరావుగారు, నల్గొండ. - 58. నాగబండి విశ్వనాథంగారు, 12/88 మైకా రోడ్డు, వరంగల్. - 59. శ్రీమతి చిదిరాల వీరలక్ష్మమ్మగారు, శ్రీ నృసింహా భక్తమండలి, 12/285 గిర్మాజిపేట, వరంగల్ - 60. శ్రీ గండె రాజయ్యగారి లింగయ్యగారు, కిరాణదుకాణం, వరంగల్ - 61. శ్రీ తోటి కేదారిగారి చంద్రశేఖరంగారు. కిరాణదుకాణం, వరంగల్ - 62. శ్రీ తాటికొండ నాగయ్యగారు, రామన్నపేట, వరంగల్ - 63. శ్రీ పుల్లాది సూర్యనారాయణగారు, అడితిదుకాణం, వరంగల్ - 64. శ్రీ మడూరు బసవలింగంగారు, వరంగల్ - 65. శ్రీ కొమరవెల్లి సూరయ్యగారు, వరంగల్ - 66. శ్రీ యాదా నారాయణగారు, వరంగల్ - 67. శ్రీ గుని శెట్టి నాగలింగంగారు వరంగల్ - 68. శ్రీ తోటి జగన్నాథంగారి ముక్తేశ్వర్ గారు, కిరాణం మర్చంట్, వరంగల్ - 69. శ్రీగన్ను బుచ్చయ్యగారు, అడితి దుకాణం, వరంగల్. - 70. శ్రీమతి కామేశ్వరమ్మగారు c/o రవ్వా కైలాసంగారు, బట్టలదుకాణం, వరంగల్ - 71. శ్రీ సోమా నరసయ్యగారు, వరంగల్ - 72. శ్రీ వజినపెల్లి నరసయ్యగారు, వరంగల్ - 73. శ్రీ చందా పుల్లయ్యగారు, జనరల్ మర్చంటు, వరంగల్ - 74. శ్రీ చిదిరాల రాజశేఖరంగారు. వరంగల్ - 75. శ్రీ చెలుపూరు మంకయ్యగారు, బట్టల దుకాణం, వరంగల్.

కోయంబత్తూరు జిల్లా: 76. సి. ఎస్. నాగరాజశ్రేష్ఠిగారు, కొళ్లేగాలం.

## గీతావాణి – పోషకవర్గము.

కృష్ణాజిల్లా:– 77. ముక్కామల సీతయ్యాగారి జ్ఞాపకార్థము ధర్మపత్ని శ్రీమతి నాగరత్నమ్మగారు, ఈడ్పుగల్లు. 78. శ్రీ బావినేని రామకోటయ్యచౌదరి, పరమాత్మానందాశ్రమము, గీతాభవనము, పెనమలూరు. – 79. శ్రీ ఆదూరి చలపతిరావుగారు. రుస్తుంబాద్, బందరు. – 80. శ్రీ మోటుమర్రి దయానిధిగారు, బందరు.

తూర్పుగోదావరిజిల్లా:– 81. శ్రీసమయమంతుల పెద్దనాగేశ్వరరావుగారు, ర్యాలి. – 82. శ్రీ సమయమంతుల జగ్గారావు & బ్రదర్స్, ర్యాలి. – 83. శ్రీ సమయమంతుల రాధాకృష్ణరావు & బ్రదర్స్, ర్యాలి. – 84. శ్రీ మాధంశెట్టి జగ్గారావుగారు, ర్యాలి. 85. శ్రీ మాతంశెట్టి నాగరాజరావుగారు, ర్యాలి.

పశ్చిమగోదావరి జిల్లా:– 86. శ్రీ ఆబోతుల రామన్నగారు, పాలకొల్లు. – 87. శ్రీ మామిడి సత్యనారాయణగారు, పాలకొల్లు.

### అభిమానపోషకులు రు. 25

1. శ్రీ కోకా సాంబశివరావుగారు, మదరాసు–16.
2. శ్రీ గజ్జహల్లి నాగిరెడ్డిగారు, వండవాగలి, ఆలూరుతాలూకా. (కర్నూలు)
3. శ్రీమతి లంకా భాగీరథమ్మగారు, పొన్నమ్మగుడివీధి, చిత్తూరు.

---

## గ్రంథ స్వీకారము.

1. ముముక్షుప్పడి:– శ్రీ పిళ్ళలోకాచార్యర్ గారి ద్రావిడమూలమునకు ఆంధ్రానువాద సహితము.

2. నిగమనప్పడి:– శ్రీ పెరియవాచ్చాంపిళ్లైగారి ద్రావిడమూలమునకు ఆంధ్రానువాద సహితము.

ప్రకాశకులు: శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘము, నిడుముక్కలవారి రామానుజ కూటము, విజయవాడ – 1.

3. విచారచంద్రోదయసారము:– స్వామి పీతాంబరులవారి విచారచంద్రోదయమునందలి ముఖ్యాంశములను సంకలించి వ్రాసిన గ్రంథము.

ఆంధ్రానువాదకుడు: శ్రీ కృష్ణచరణంగారు. వెల 0–4–0

ప్రకాశకులు: శ్రీవ్యాసాశ్రమము, ఏర్పేడుపోస్టు, చిత్తూరు జిల్లా.

Edited & Published by N. Shrikantam, Gulladurthy, Koilkuntla
Managing Editor: Swami Sri Ramakrishnananda, Vice-President
Sri Gita Sahitya Sevasamithi, Allagadda – Kurnool (Andhra)

# గీతాజయంతీ విశేషసంచిక.

మార్గశిర శుద్ధ ఏకాదశి గీతాజయంతీ మహోత్సవ పర్వదినమును పురస్కరించుకొని గీతావాణి విశేషసంచికను అనగా దాదాపు 80 పేజీలకుపైగా పెద్దసంచికను ప్రతిసంవత్సరము గీతావాణి కార్యాలయమువారు వెల్వరించుచుండుట పాఠకులకు తెలిసినవిషయమే. గత మూడుసంవత్సరములును అట్లే జరిగినది. ప్రముఖ మహనీయ వ్యక్తుల అమూల్య వ్యాసరాజములతో అలరారి ఆ విశేషసంచికలు మూడును సర్వమాన్యములైనవి.

అదేవిధమున యీ సంవత్సరముకూడ డిసెంబరు నెలయందు గీతాజయంతీ మహోత్సవ విశేషసంచిక ప్రకటింపబడును. కాని యిప్పుడు మరొక్క విలక్షణ పద్ధతి ననుసరించితిమి. ఆపద్ధతి పాఠకుల కందరికిని రుచింపగలదనియె మావిశ్వాసము.

ఈ జయనామ సంవత్సర చైత్రమాసమునందు శ్రీ రామకోటి సప్తాహ మహోత్సవముల సందర్భమున కోలారుజిల్లా బంగారుపేట యందు శ్రీ శంకరానందస్వాములవారు భగవద్గీత పన్నెండవ అధ్యాయము భక్తియోగమును గురించి వారముదినములుపన్యసించినారు. ఆ ఉపన్యాస సారాంశమును అదే ఫక్కీలో వ్యావహారిక భాషా శైలిలో శ్రీ రామకృష్ణానందస్వామివారు గ్రంథరూపమున వ్రాసియున్నారు. మొత్తము విశేషసంచికనంతయు ఆగ్రంథమె ఆక్రమింపగలదు; కావున యితరవ్యాసముల నందు చేర్చుటకు వీలుండదు. ఆ భక్తియోగసంచికను ఈసారి గీతాజయంతీ పర్వ సందర్భమున గీతావాణి పాఠకుల కరకమలములందు సమర్పించుచున్నాము. గీతాభక్తులు—గీతాసేవకులు — గీతాప్రచారకులు — గీతోపన్యాసకు లీమహాదుద్యమమునకు ఉత్సాహ ప్రోత్సాహముల నివ్వగలరని ఆశించుచున్నాము.

మే నే జ రు,

గీతావాణి కార్యాలయము.

# గీతాభక్తులకు విజ్ఞప్తి.

(కార్యాలయ ప్రకటన)

రాబోయే మార్గశిర శుద్ధ ఏకాదశి సోమవారం (6–12–54) గీతాజయంతి పర్వదినం. ఆ పవిత్ర సందర్భమున పాల్గొని గీతాపాఠకులు – గీతా తత్త్వాభిమానులు – గీతాప్రచారకులు – గీతాసేవకులు, గీతాజయంతీ కార్యక్రమమును సుసంపన్నమొనర్చుటకై మాదిరి కార్యక్రమమును క్రింద సూచించుచున్నాము.

1. భగవద్గీతాగ్రంథమును పూజించుట.
2. గీతాచార్యుడగు శ్రీకృష్ణునియొక్కయు, గీతాఋషియగు శ్రీ వేదవ్యాసునియొక్కయు పూజలు_అర్చనలుసల్పుట.
3. గీతను పూర్తిగ పారాయణముచేయుట.
4. స్థానిక పాఠశాలలయందుగాని, విద్యాలయములందుగాని, గీతకు సంబంధించిన విషయములలో పోటీ పరీక్షలు యేర్పాటుచేసి అందు పాల్గొన్న విద్యార్థులకు గీతా సంబంధ వాఙ్మయమును బహూకరించుట.
5. సాయంకాలమందు గీతోపన్యాసములను, ప్రవచనములను ఏర్పాటుచేసి గీతాతత్త్వసందేశవ్యాప్తికిదోహదమిచ్చుట.
6. రాత్రికి గీతామాతకు ఉత్సవములు – నగరసంకీర్తనలు చేయుట.

★ గీతావాణి పాఠకులు మా సూచనలను ఆధారముగ తీసుకొని గీతాజయంతిని దిగ్విజయముగ నిర్వహించి గీతామాత యొక్క కృపా కటాక్షములకు పాత్రులు కాగలరని ఆశించుచున్నాము.

---

గీతాజయంతీ వార్తలను సంగ్రహముగ వ్రాసి గీతావాణి కార్యాలయము, అల్లగడ్డకు సంపాదకునికి పంపవలెను.

శ్రీ వేదవ్యాస ప్రెస్, చిత్తూరు, నవంబరు 1954 కా. 1000.